# మిసిమి

మాస పత్రిక

జూన్ - 2003



రూ. 8/-

## చిత్రకారుని గురించి



**రినాల్డ్స్ 1723 - 1792**

రెనాల్డ్స్ కళా సాహిత్యాలను ఎంతో అభిమానించేవాడు. ఈ అభిమానం కళాకారుని అంతస్తును పెంచాలనే అతని జీవిత వాంఛకు జీవం పోసింది. అంతకు ముందు ఎవరూ కని విని ఎరుగని విజయాన్ని తన వృత్తిలో సాక్షాత్కరించుకోవడంతో, తన లక్ష్యం నెరవేరింది. జీవిత సాఫల్యం చేకూరింది.

పద్దెనిమిదో శతాబ్దిలో బ్రిటన్‌లో అత్యంతంగా విశిష్టుడైన కళాకారునిగా ఎదిగాడు రెనాల్డ్స్. అతడు కళావృత్తి చేపట్టిన మొదటి దినాల్లో కళాకారుని వృత్తి అధోగతిలో ఉండేది. తన వ్యక్తిగత ప్రతిష్టతో నాటి ఉద్దండ సాహితీకారులతో తనకున్న పరిచయాలతో, సమాజానికి కళపట్ల ఉన్న దృక్పథాలో విప్లవం తీసుకువచ్చాడు. ఆ విధంగా అతడు రాయల్ అకాడమీ ప్రసిడెంట్ గూడ అయ్యాడు.

అతడు మొదటి నుంచి గూడ పండిత కళాకారుడు కావాలని కలలు కనేవాడు. అందుకని అతడు రూబెన్స్, రాఫెల్, మైకలాంజెల్ లంటే ఇష్టపడేవాడు. రాయడంలోను, చిత్రలేఖనంలోను ఎంతో ఎత్తులకు ఎదిగాడు.

ఒక కవిలాగ, చిత్రకారుడు, తన నాయకుని ఒక గొప్ప వ్యక్తిగా మాట్లాడించలేడు. అందుకని అతడు తన నాయకుని గొప్పవానిగా కనిపించేట్లు చేయాలి. తన మోడల్ "ఉదాత్త మనస్సును" ప్రతిబింబించాలనుకొంటే, అతని లోపాలను సరిదిద్దాల. అలెగ్జాండర్ పొట్టివాడైనంత మాత్రాన అతనిని పొట్టిగా చిత్రించవలసిన పనిలేదు. అటువంటి శారీరక లోపాలను అధిగమించాలంటే మనం పూర్వీకులను అనుకరించాలి. అంటే ఆదర్శవంతమైన సౌందర్యానికి అవసరమైన నియమాలను పొదిగి ఉన్న పూర్వకాలపు గ్రీకు, రోమన్, శిల్పాలను అనుసరించాలి.

ఇతడు 1723లో ప్లైమ్‌టన్‌డెవన్‌లో శామ్యూల్ రెనాల్డ్స్ అనే క్రైస్తవ మతాచార్యునికి పుట్టాడు. అప్పట్లో కొత్తగా ఏర్పడిన రాయల్ అకాడెమీకి 1768లో ప్రథమ అధ్యక్షుడయ్యాడు. 1792లో లండన్‌లో మరణించాడు.

## ముఖచిత్రం : కాల వ్యవధికి నర్తించడం

ఈ చిత్రాన్ని చిత్రించడంలో రెనాల్డ్స్ మదిలో కాలవ్యవధికి అతీతంగా నర్తించడాన్ని చూపించే పేసిన్ చిత్రించిన 'కాల సంగీతం' చిత్రం ఉంది. పేసిన్ చిత్రంలో పూలమాల కాల వ్యవధిని ప్రతిబింబిస్తే రెనాల్డ్స్ చిత్రం అదే కాల వ్యవధిని జాన్స్ ప్రతిబింబిస్తుంది. జాన్స్‌కు రెండు ముఖాలుంటాయి. ఒకటి జనవరిని (భావిని) రెండోది గతాన్ని (డిసెంబరును) చూస్తుంటాయి. అసలు జనవరి పేరు జానస్‌నుంచే వచ్చింది. అలా జాన్స్ ఫేస్ భావిని, గతాన్ని సూచిస్తుండగా కాల రూపుడు తన తీగల వాయిద్యం (lyre) మీద సంగీతాన్ని పలికిస్తాడు.

*(మూడవ, నాల్గవ అట్టలపై చిత్రాలు కూడా వీరివే)*

# మిసిమి

**"All that we are is the product of what we have thought"**
**is "We are what we think." - Dammapada.**


సంపుటి 14 | జూన్ 2003 | సంచిక 6

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**


## విషయ సూచిక




విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **కాల వ్యవధికి నర్తించడం**

చిత్రకారుడు : **రెనాల్డ్స్**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# THE CHEMISTRY OF LOVE

**- Raj Chatterjee**

I have always had my doubts about this business of falling in love at first sight. I was intrigued, therefore, to read a few days ago, an article in a foreign magazine. I quote : "according to a Los Angeles neurochemist. Dr Eugene Robers, love at first sight is not strictly human act but the electrical response to command neurons is, in fact, little better than a programmed release of glandular chemicals."

It is true that such electrical responses to the release to "glandular chemicals" did frequently affect my system in the days of my youth.

## NOW AND AGAIN

The first time this happened to me was at a Christmas party nearly 80 years ago. I was in short pants and the object of my adoration, in pigtails. The fact that my face was spotted with acne and that she had rather prominent front teeth didn't seem to matter. We just fell for each other as they say, "hook, line and sinker."

For about three months I wooed the lass with packets of chewing gum and four-anna comics. Then came a rival with more pocket money than I had who cut me out with slabs of imported chocolates, glass bangles and other gew-gaws, My little world collapsed about my feet but built up again in a surprisingly short space of time.

My next excursion in the realm of romance took place when I had changed from short pants to the baggy trousers that were popular with the undergrads of the '30s.

A rather attractive girl in my class used to borrow my notes and, in course of time she stole my heart. Without taking the elementary precaution of finding out whether her electrical responses towards me were similar to those that I experienced in her presence I dashed off a poem and put it between the pages of a library book that she had asked me to obtain for her.

The poem, I regret to say, wasn't an original effort. All I had done was to copy out one of Byron's odes, substituting the girl's name for that of the lady of his mercurial fancy.

I don't think the girl was familiar with the poetical works of Lord Byron, so the substitution didn't matter.

But the rather impassioned language did. It upset her so much that she gave my hand-written note to her father who promptly took it round to the principal of my college.

After an extremely unpleasant interview with the principal and my tutor, I was rusticated from the college for a period of one month. I think my scepticism and aversion to poetry both began about this time and have clung to me ever since.

**(Courtesy:** ***Statesman*****)**

# ఆదర్శవాది కార్ల్ అడాల్ఫ్ గ్జెల్లెరప్

## (1917 నోబెల్ సాహిత్య బహుమతి పురస్కారోపన్యాసము)

మూలం: స్వెన్ సోడర్మన్, స్వీడన్. అనువాదం: వాడపల్లి లక్ష్మినారాయణాచార్యులు

కార్ల్ అడాల్ఫ్ గ్జెల్లెరప్ 1857లో జన్మించేరు. హెన్రిక్ పాన్టోపిడాన్ లాగా వీరు కూడా క్రైస్తవ మతాచార్య కుటుంబం నుంచి వచ్చేరు. మతాచార్య వృత్తిపై తనకు అంతగా ప్రవృత్తి లేకున్నా తొలిగా ఆవృత్తితోనే జీవిక ప్రారంభించేరు. కాని తన పని కన్నా మిన్నగా సాహిత్య కృషివైపు మొగ్గు చూపుతూ గ్రీకు, ఆంగ్ల సాహిత్యాల్ని క్షుణ్ణంగానూ జర్మన్ కావ్యాల్ని ప్రత్యేక ప్రతిపత్తితోనూ అభ్యసించేరు. క్రమక్రమంగా వృత్తి పరమైన వేదాంత ధోరణులకు దూరమై పోయి జార్గ్ బ్రాండిస్ ప్రతిపాదిత సాహితీ సమూల సంస్కార సిద్ధాంతాలవైపు ఆకర్షితులైనారు.

1878లో ఎపిగోనస్ అనే మారు పేరుతో రచించిన యెన్ ఇడియలేస్ట్ (ఎన్ ఐడియలిస్ట్) అనే చిన్న నవలా రచనతో తన నిరంతర సాహితీ వ్యాసంగానికి గ్జెల్లెరప్ శ్రీకారం చుట్టేరు. దాని వెనువెంటనే వెలువరించిన పుంఖానుపుంఖ కథలతో గేయాలతో వీరు వేదాన్త ధోరణికి ప్రబల శత్రువుగా, డార్విన్ పరిణామ సిద్ధాంతం పట్ల ప్రగాఢ పక్షపాతిగా రూపుదాలుస్తున్నారని తెలియ సాగింది.

అయితే ఈ వేదాన్త వైముఖ్యం వీరి వైయక్తిక ప్రతిభ వల్ల ఇంకా లోకానికి సుస్పష్టం కాని ఆ ప్రథమ దశలోనే వీరు విదేశ పర్యటన చేసేరు. ఈ పర్యటనలో గ్జెల్లెరప్ ఎన్నెన్నో ఆలోచనలను సేకరించడంతోబాటు తన తెలివి తేటల కొక సుస్థిరత ఆపాదించుకొన్నారు. ఈ సమయంలో వారి సాహితీ ప్రతిభ అతి సుస్పష్టాకారంతో బహిర్గతం కాజొచ్చింది. ఫలితంగా మూడు విశిష్ట రచనలు వెలువడ్డాయి. 1883లో రచించిన రోమ్యులస్ ఈ శకానికే వివరణాత్మక రచన. అదే సంవత్సరంలో రచించిన జి- డర్ (జి-మేజర్) సర్వాంగ సుందరమైన చిన్న కథ!

ఇక 1884లో రచించిన బ్రైన్‌హిల్డ్ ఆత్మీయతను చిత్రీకరించిన గొప్ప నాటకం. ఈ పర్యటనా కాలంలో పతాక స్థాయినందిన వీరి ప్రతిభ ఈ నాటకంలో ప్రతిఫలిస్తోంది. వాల్సుంగా సాగే అనే ఉపాఖ్యానం ఈ నాటకంలోని విషయం. సిగర్డ్, బ్రయ్ హిల్డె అనే జంట స్నేహాత్మీయతలతో సమాన శిఖరాల్ని అధిరోహించాలనుకొంటారు. కాని ఆ లక్ష్య సాధనలోనే విడిపోతారు. అయినా పరస్పరం కోరుకుంటూ కలలు గంటుంటారు. వీళ్ళ పరస్పర నిరీక్షణనీ ప్రగాఢ మనోవేదననీ నిశ్చల వాంఛనీ - గ్జెల్లెరప్ గొప్ప సమర్థవంతంగా స్వకీయ కవితా రచన, పాత్ర చిత్రీకరణల పరమైన ప్రతిభతో ఈ విషాదాంత నాటకంలో రసాత్మకంగా పాఠక, ప్రేక్షకుల మనస్సులోకి పరావర్తింప జేసేరు. కోరస్‌లలో ప్రాచీన పంథాను పాటిస్తూ రచించిన కవితలు చక్కని ఛందస్సౌందర్యాన్ని ఆవిష్కరిస్తున్నాయి. ఆదర్శ వాదంతో మహోన్నత నీతిబోధనతో విషయ గాంభీర్యాన్నీ రూప పరికల్పననీ సంతరించుకొన్న ఈ రూపకం కవి ఆశయాల్ని నెరవేర్చింది. సమకాలీన వాస్తవిక వాద రచనలన్నిటికన్నా ఈ నాటకం విభిన్నంగా విశిష్టంగా రూపుదాల్చింది. స్వకీయ స్వతంత్రాలోచనలకు విరుద్ధంగా అంతరాంతరాలలో వాస్తవికవాద సంప్రదాయంతో కొన్ని సామాన్య అనుబంధాలు గ్జెల్లెరప్‌కి ఉండేవి. అలాగే జర్మన్

---

భాషాప్రవీణ శ్రీ వాడపల్లి లక్ష్మినారాయణాచార్యులు, విజయనగరం

'క్లాసిసిజం'తో ప్రాచీన సాహిత్యంతో, వేగ్నర్ రస సిద్ధాంతంతో వారికి చాలా ఎక్కువ సంబంధాలు ఉండేవి. కాని; యథార్థాన్ని ఆకళించుకొన్నాక వీరు బ్రాండెస్ సంప్రదాయంతో నిక్కచ్చిగా బాహాటంగా తెగతెంపులు చేసుకొన్నారని 1885లో రచించిన వేండ్రియారెల్ (వాండర్ ఇయర్) అనే యాత్రాగ్రంథం రుజువు చేస్తోంది. ఈ గ్రంథ రచన తర్వాత జరిగిన వీరి సాహిత్య సృష్టి (నాటకాలు, లిరిక్ పద్యాలు, కథలు) ఆదర్శవాదానికి సన్నిహితమైంది. అయితే ఎంతగా వీరి వైయక్తిక ప్రతిభాయుత కవితాత్మక విలువలు గోచరిస్తున్నా, ఆ ఆదర్శవాద సాన్నిహిత్యం తొలినాళ్ళలో కేవలం కళా ప్రదర్శనపరంగా మాత్రమే కొనసాగింది. ఈ దశలో వీరు రచించిన ఎన్నో మేలు రచనలలో ఆణిముత్యంలాంటి నవల-మిన్నా (1889). స్త్రీ మనస్తత్వాన్ని సున్నిత దృష్టితో ఆకళించుకొని రచించిన సుందర ప్రణయగాథ ఇది. స్కాండేనియన్ నవలల్లో అత్యున్నత స్థాయిని ఈ నవల అందుకొంది. కథాపరంగా కట్టుదిట్టమైన పునాదితో రచనాపరంగా సుదృఢమైన సృజనగా కూడా మనం ఈ నవలని పరిగణించాలి.

1896లో రచించిన మిల్లెన్ (ది మిల్) పశ్చాత్తాపంతో తనను తానే బహిరంగంగా నిందించుకొనే హంతకుని మానసిక స్థితిని వెలార్చే అపురూప విశ్లేషణాత్మక రచన. ఇదొక ఉదాత్త విషాదాంతంగా వాసికెక్కింది.

హెర్మన్‌వేండిల్(1891); వుత్‌హోర్న్ (1893); హేన్స్ ఎక్సలెన్స్ (1895) అనే మూడు నాటకాలు ఒకే మూసకు చెందినవి. కళాపరంగా కాస్తంత తక్కువ రచనలే గాని; గ్జెల్లెరప్‌కు పెళ్ళిపైనా పరస్పర సెక్స్ సంబంధాలపైనా గల ఉన్నత నీతి దృక్పథాన్ని వివరించి చూపే రచనలు. ఈ నాటకాలు పెళ్ళి సంప్రదాయాన్ని కాదంటాయి. నిజానికి నాటకాల ద్వారా కవి లోకరూఢియైన వైవాహికాచారాన్ని త్రోసిరాజని మరో పెళ్ళి ఊహని ప్రతిపాదిస్తారు. ఖండితంగా తన ఊహే శ్రేష్ఠమంటారు గాని సామాన్యుల వివాహాల్లో ఆతని ఊహ ఎలా పొసగుతుందో కవి వివరించలేదు. వారు స్వచ్ఛమైన ఆదర్శవంతమైన స్వేచ్ఛాయుత సంగమాన్ని ప్రతిపాదించేరు. ఈ వైవాహిక విధాన ప్రతిపాదన అటు చర్చి దైవ సమర్పణ విధానానికీ ఇటు సామాజిక దృక్పథానికీ చుక్కెదురుగా వున్నా మానవ జీవితాలకి ఇదొక్కటే సరైన దంటారు. ఈ మూడు నాటకాలూ ప్రతిపాదించిన తిరుగుబాటు తీరు తెన్నులు మత విరుద్ధమైనవి. ఇవి కవి సాహితీ కృషి జీవితంలో భావగర్భిత కాలానికి ప్రతీకలుగా ఉంటూ అటు కవికి చెందిన ఉన్నత వర్గానికీ ఇటు ఆయా ఛాందస లక్షణాలతో కొట్టుమిట్టాడే మధ్య తరగతికీ తేడా సృష్టి [illegible]యి.

వేగ్నర్ రచించిన రసమయ సంగీత నాటకంపై గ్జెల్లెరప్‌కు అమితమైన ఆసక్తి. నిజంగా కేవలం ఈ ఆసక్తి కారణంగా తానొక మహా కార్య సాధనకి అంకితమై పోయి; బౌద్ధమత విజ్ఞాన సాధన చేసేరు. ఈ మతం లోకానికి చేసిన నిర్వాకమేమిటయ్యా అంటే నిర్వాణంతో ఐహిక మూర్తిమత్వ వినాశనాన్ని

గ్జెల్లెరప్ 20వ శతాబ్ది రచనలలో మేలైనవన్నీ ఖచ్చితంగా భారతీయాలోచనలతో ప్రభావితాలైన రచనలే. ఈ నాటకాల ద్వారా హిందూ పౌరాణికనాయకులెందరో గ్జెల్లెరప్‌చే కవితాత్మకంగా తీర్చిదిద్దబడి వేదికల మీంచి ఆదర్శవంతంగా ప్రసంగించి ప్రజల మెప్పు పొందేరు.

గ్జెల్లెరప్ ఈ తరహా రచనా కాలాన్ని 1903లో సంగీత నాటకంగా రూపొందించిన ఆఫరిల్డానె (ది సేక్రిఫీషియల్‌ఫైర్స్)తో ప్రారంభించేరు. ఈ నాటకంలో ఒక భారతీయ ఇతిహాస కథ విషయం. బ్రహ్మకు ఒక యువక శిష్యుడుంటాడు. అతడు అతి నిరాడంబరుడు. తన పవిత్రాత్మతో శబ్దార్థ పరిజ్ఞానానికి మూలమైన నియమపరమైన ఇంద్రియ జ్ఞానాన్ని సాధిస్తాడు. లోకంలో గార్హపత్య, దక్షిణ; ఆహవనీయ అనే త్రేతాగ్నులను పదిలపరచాలనుకొంటాడు. ఈ యజ్ఞాగ్నులు మూడిటిలో ఒకటి ఆత్మ సంబంధితాగ్ని. రెండోది ప్రేమ సంబంధాగ్ని. మూడోది పార్థివ శరీరాన్ని దహించేచితాగ్ని. కవి సృజనాత్మక భావనతో భారతీయ తాత్త్విక చింతన పరస్పర మైత్రీవంతంగా ఈ నాటక రచనలో సమ్మిళితమైంది.

1906లో రచించిన పిలిగ్రిమెనిన్‌కామనీత అనేగొప్ప పౌరాణిక నవలలో బుద్ధ శకం చరిత్ర ఉంది. గ్జెల్లెరప్ ప్రపంచంలో బౌద్ధమతం ప్రచారం చేసి పాదుకొల్పిన భావనల్నీ సిద్ధాంతాల్నీ విశదీకరించేరు. పరిత్యాగ సిద్ధాంతం; పరి సమాప్తి గూర్చి ఆ మతం చేసిన ప్రయత్నాలు; స్వర్గ నిర్వాణ మహాప్రళయాల గూర్చి కలలు గన్న తీరూ - ఇలా ఎన్నో కవి తేట తెల్లం చేసేరు. నాటక నాయకుడైన కామానీత ప్రాపంచిక సుఖాలకై ప్రాకులాడే ఒక వ్యక్తి. అన్నింటి నిస్సారతనూ జీర్ణించుకొన్నాక వాటి స్థానే నిత్య సంపదల్ని కోరుకుంటాడు. మనం ఆ కథా నాయకుణ్ణి భౌతిక జీవితంలోనేగాక అందుకు భిన్నంగా వివిధ మారు రూపాలతో - ఉష్ణదేశ సంబంధ విలువలతో విశేషించి భారతదేశ దృష్టితో కవి నూత్నంగా కనుగొన్న ''పాశ్చాత్య స్వర్గం'' లో తిరుగులాడడం కూడా అంగీకరిస్తాం! ఈ స్వర్గంలో - తమంతతామే తమ జీవితాల్ని నాశనం చేసుకొన్న వారంతా ఒక్కసారి ఉద్బుద్ధులైచేతుల్లోని పద్మం మొగ్గల్ని గిరాటేసి తమ తమ పరివ్రాజక అనుగ్రహీతలతోబాటు నృత్యంలో పాల్గొంటారు! అంతేకాదు వందల వేల కాల చక్ర పరిభ్రమాల బాటు ఎన్నెన్నో జాతక అవతారాలెత్తుతూ; తమతోబాటు తమ ఆత్మలు కూడా ప్రవేశించూ నూత్నాతినూత్నంగా ఆ బుద్ధ సామ్రాజ్యంలో తిరుగులాడుతూనే వుంటారు! వివరణలు లేని భారతీయ వేదాంత ధోరణులకు భిన్నంగా ఈ కావ్యం ఏకైక భ్రమ గూర్చే సాధకం చేసింది. సహజ జ్ఞానంతో నిశ్చలంగా ఉన్న కవి సుదూర ప్రాంతాలలో ఉన్న ప్రజల ఆధ్యాత్మిక శక్తిమయ జీవితాల్లోకి చొరబడి స్వకీయ దార్శనిక దృష్టితో వారి కలల్ని వివరింపబూనుకొన్నాడు! ఈ కావ్యంలోని కొన్ని ఘట్టాల్లో అరేబియన్‌నైట్స్ శక్తులు కూడా మనకు తారసపడతాయి. మరికొన్నింట పాశ్చాత్య స్వర్గంలోకి చొచ్చుకువచ్చిన ఘనమైన దివ్యత్వాలు పరివ్రాజక అనుగ్రహీతల జీవితాలలో సాక్షాత్కరిస్తాయి.

ఇదే పంథాలో 1907లో రచించిన డెన్ ఫుల్‌డెన్‌డ్టెస్ హుస్టర్న్ (ది వైఫ్ ఆఫ్ ది పెర్ఫెక్ట్ వన్) అనే నాటకం కూడా ఉంది. ఇందులో బుద్ధుని భార్య పరిశుద్ధీకరణతో పరినిర్వాణానికి పూనుకోడం విషయం. ఈ కళాఖండం ఒక ఉన్నత రచన. సహస్రాధిక కాలాల వేదాన్త ధోరణుల్నీ ఆయా అహేతుక వాదాల్నీ తన స్వభావ, విజ్ఞానాల ద్వారా ప్రకాశింపజేయడంలో కవి కృతకృత్యులయ్యారు. గ్జెల్లెరప్ చివరి ఉత్కృష్ట రచన వెర్డెన్స్ వార్న్‌డ్రెర్నె (1910) (వరల్డ్ వాండరర్స్). ఇది సగం ప్రాచ్య; సగం పాశ్చాత్య నీతులతో రచింపబడి పై రచనలతో సమానంగా కళాత్మక సౌందర్యాన్ని సంతరించు

కోలేకపోయింది. కాని, మార్మిక వాద ఊహలతో నిండి ఉండి రమణీయ వివరణలతో, నటనాపరమైన ప్రగతితో మన ఆసక్తిని ఆకట్టుకొంటుంది.

కార్ల్ గ్జెల్లెరప్ అటు పాండిత్యమూ ఇటు కవిత్వమూ మహోన్నత దశలో గలిగినవారు. వారిలోని వినూత్న సృజనాత్మక భావ ఔన్నత్యమూ వారి పాలిటి వరమైన కవితాదార్శనికతా వారిలోనే వున్న విశేష పరిజ్ఞానంతో, చురుకైన సూక్ష్మ బుద్ధితోనూ సరితూగాడం కష్టసాధ్యమే! వారి తొలిరచనలు విశాల గుణభరితాలే గాని అప్పుడప్పుడు క్లిష్ట వర్ణనలతో వేదాంత విషయాలతో స్వచ్ఛందతని పోగొట్టుకొంటాయి. అవి తరుచు కళాత్మక నిర్మాణాన్ని త్రోసి రాజంటాయిగాని అటు భావనల్లోనూ ఇటు సహజత్వ సాధనలోనూ గొప్పవే! ఈ విమర్శకు దూరంగా ఉన్న రచనలు - బ్రేన్‌హిల్డ్; మిన్నా అనేవి.

హిందూ మార్మిక వాదగాథల్లో ఒక కథ వుంది. ఒక కవి తన కళా తృష్ణ తీర్చుకోడానికి తన ప్రగాఢ ఆలోచనల్నీ తన ఆదర్శ ప్రయత్నాల్నీ వినియోగించుకొని - ప్రపంచం మొత్తం మీద ఉన్న పూలనన్నిటినీ సేకరించడం ఆరంభించేడట! అయితే ఒక పైశాచిక శక్తి ఇతగాడి కంట బడకుండా తీరికన్నది లేకుండా తిరిగి తిరిగి ఆ పూలనన్నిటినీ యథాపూర్వ స్థితిలో ఉండేలా చేస్తూ పోయేదట! - సరిగ్గా గ్జెల్లెరప్ తన రచనాపరమైన రెండవదశలో అలానే ఉన్నారు. వారి ఆలోచనలన్నీ మనో వికారాల పరిధిలోనూ; అకుంఠిత ప్రజ్ఞ అంతా ఆత్మ గూర్చి చేసిన అన్వేషణలోనూ; ప్రగాఢ కవితా రచనాభిలాష సర్వం సౌందర్య పరికల్పనలోనూ - అంకితాలైపోగా వారు కేవల సంతృప్తికర స్థాయి సాహితీ సృష్టికే అంకితమైపోయేరు! ఏదేమైతేనేం. 'పిల్‌గ్రిమెన్ కామానీటా'; 'డెన్‌ఫుల్డెన్‌డ్టెస్ హుస్టర్స్'ల నిర్మాత న్యాయబద్ధంగా 'బౌద్ధమత మహా కావ్య నిర్మాత' - అని వాసికెక్కక మానరు!

## జీవిత చరిత్ర

నేను 1857 జూన్2న ప్రాయిస్టోలోని రోహోలిక్ క్రైస్తవ మతాచార్య కుటుంబంలో పుట్టేను. ప్ాస్టర్ కార్ల్ అడాల్ఫ్‌గ్జెల్లెరప్ మా నాన్నగారు. మా అమ్మగారు అన్నా ఫిబిగర్. 1860లో లోల్లేండ్‌లోని లేండర్ మతాచార్య ఆవాసంలో మా నాన్నగారు పరమపదించేరు. (నాకిప్పటికీ ఆ లోల్లేండ్ స్మృతులెన్నో వస్తుంటాయి!) నేను అదే సంవత్సరం నవంబరులో మా అమ్మగారి పినతండ్రికొడుకైన ప్ాస్టర్ జోహన్నెస్ ఫిబిగర్‌గారింటికి చేరుకొన్నాను. వారిల్లు కోపెన్‌హేగన్‌లో వుంది. వారొక మహావ్యక్తి ఔద్యోగికంగా ఆ ఊరిలోని గేరిసన్ చర్చిలో పారిష్ మతాచార్యులు; వైయక్తికంగా గొప్ప కవులు. వారు 1857లో జోహన్నెస్ డెన్‌డోబర (జాన్ ది బాప్టిస్ట్); 1865లో నోగిల్‌సాగ్నె (సమ్ స్టోరీస్); 1858లో కోర్స్ ఒగ్ కయిర్‌గ్లెడ్ (క్రాస్ అండ్ లా); 1878లో డెన్ యెవిజెస్టిడ్ (ది ఎటర్నల్ స్ట్రిఫ్); 1898లో మిర్ లివ్ ఒగ్ లెవెన్డ్ (మై లైఫ్) అనే గ్రంథాలు రచించేరు.

నేను సుమ్మా కమ్ లాడె అనే గ్రాడ్యుయేషన్‌పట్టాను హెర్లుఫ్స్ గ్రామర్‌స్కూలు నుండి 1874లో పొందేను. దీనికి ముందే నేను కొంత రచనా వ్యాసంగం ఆరంభించేను. గ్రాడ్యుయేషన్ ముగియగానే స్కిపియో ఆఫ్రికాయ్స్ అనే విషాదాంత నాటకాన్నీ; ఆర్మినీనిస్ అనే నాటకాన్నీ రచించి రెండింటినీ

మా బాబయ్య గారైన ప్రొఫెసర్ యెడ్వర్డ్ హోల్మ్‌కి చూపేను. వారు నా భుజం తట్టి నన్ను క్రిస్టియన్ యాల్‌బెక్ నెర్త్‌లేస్ గారి దగ్గరకు తీసుకువెళ్ళి నారెండో రచనని వారికి చూపేరు. నేను మత విద్యను అభ్యసించేక ఎక్కువగా పల్లెటూరులో గడిపేను. (ఆ పల్లెటూరు పేరు వాల్లెన్‌స్వెడ్. జైల్లేండ్‌కి దక్షిణ తట్టు. అక్కడే ఫిబిగర్ మతాచార్యునిగ ఉండి 1881లో ఫాస్టర్‌గా ఆన్‌స్లెవ్ పని చేసేరు.) ఈ పల్లె జీవితం నా మనసుపై చెరగని ముద్ర వేయడమే గాదు, నా నవలలన్నింటా ప్రతిఫలించింది. 1878 జూన్‌లో నేను బి.డి. (సుమ్మా కమ్ లౌడె) ని సంపాదించేను. ఆ వెన్వెంటనే నేను యెన్ ఇడియెలిస్ట్ (ఎన్ ఐడియలిస్ట్) 1878లోనే ఆరంభించేను. అది ఆ సంవత్సరం నవంబర్‌లో ప్రకటితం కావడం అదే నెలలో డెన్ యెవిజెస్ట్రిడ్‌ని కూడా ప్రకటించడం జరిగింది. ఈ రెంటినీ నేను మారు పేరుతో రచించేను. ఎంచేతంటే ఈ రెండు గ్రంథాలూ కొంత చిత్తక్షోభని కలిగిస్తాయి. అప్పుడే నేనెందరో ప్రతిభా శాలురతో పరిచయ మేర్పరచుకొన్నాను. వారిలో కొందరు: హోఫ్‌డింగ్, డ్రాచ్‌మన్, స్కాండార్ఫ్, బార్ఫ్‌సెనియస్, బ్రాండెస్ సోదరులు, జె.పి. జాకబ్సెన్, ఇంకా ఎందరో. నిర్విరామ సాహితీ సృజనకు నడుం బిగించి అందాకా కృషి సల్పని విజ్ఞాన శాస్త్రం వైపు మొగ్గు చూపేను. ఫలితంగా 1881లో అర్విల్గిడ్ ఒగ్‌మోరల్(హెరిడిటీ అండ్ మోరల్స్) అనే గ్రంథాన్ని రచించేను. ఈ గ్రంథం విశ్వవిద్యాలయ స్వర్ణ పతకం గెలుచుకొంది. జెర్మానెర్నెస్ లెర్లింగ్ (ది ఎప్రంటీస్ ఆఫ్ ది ట్యూషన్స్) (అసలు దీనికి నేను తొలిగా ప్రోగ్రాం ఫర్ ఎగ్జిస్టెన్స్' అనే నామకరణం చేసేను) అనే నవలని 1882లో; రోడిజోర్న్ (హోథర్న్) అనే పద్య సంకలనాన్ని 1881లో; ఆండర్ ఒగ్ టిడర్ (స్పిరిట్ అండ్ టైమ్స్) అనే సంగీత ఆలాపనా భరిత స్మృతి రచనని డార్విన్ మృతిపై 1882లోనూ రచించెను. ఆ కాలాన ఇవన్నీ గణనకెక్కినవి.

అనుకోని వారసత్వ సంపద చేజిక్కడంతో ఓ పెద్ద విదేశ యాత్రాభాగ్యం 1883లో నాకు దక్కింది. ఈ యాత్రలో మూడు నెలల బాటు రోమ్‌లో గడిపేను. అప్పుడు క్రాన్‌బెర్గ్‌తో కలసి వాటర్ కలర్స్‌లో శిక్షణ పొందేను. దరిమిలా పేస్టెల్, ఆయిల్ పెయింటింగ్‌లలో కూడా శిక్షితుడినయను. నా తిరుగు ప్రయాణంలో స్విట్జర్‌లాండ్, గ్రీస్, రష్యాలని సందర్శించి, స్టాక్‌హోమ్ మీదుగా క్రిస్టమస్ నాటికి గూటికి చేరుకొన్నాను.

పై యాత్రా కాలంలో రోమ్యులస్; జి-డర్ అనే రెండు చిన్న కథల్ని వెలువరించేను. యాత్రానుభూతి ముద్రల ఫలాలుగా యెన్‌క్లాస్సిస్క్ మాన్నెడ్ (ఎ క్లాసికల్ యన్త్) ని 1884లోనూ; వేంద్రియారిల్ (వాండర్ ఇయర్) ను 1885లోనూ రచించేను. ఈ రెండింటి రచన తర్వాత నేను పూర్తిగా గూర్గ్ బ్రాండిస్ అనుయాయులతో తెగ తెంపులు చేసుకొన్నాను. ఆ తర్వాతి దశలో నా తొలి రచన అందరినీ ఆశ్చర్యపరచిన బ్రైన్‌హిల్డ్ (1884) అనే విషాదాంత సంగీత రూపకం. నా విద్యార్థి దశ నుండీ రేఖామాత్రంగా ఈ నాటకకథ నా మనసులో మెదుల్తూనే ఉంది. ఈ రచనను యెయుగేనియాకు అంకితమిచ్చేను.

1885 వేసవి నుండీ 1887 చివరి దాకా నేను డ్రెస్డెన్‌లో గడిపెను. అక్కడుండగా నేను విప్లవాత్మక నాటకమైన సైంట్ జస్ట్ (1885) కోసం కొన్ని అంకాల్ని రచించేను (1913లో జర్మనీలో ఉండగా

నాటకవేదిక కముగుణంగా తిరిగి వ్రాసేను గాని నేటికీ ఇంకా ప్రచురణకు నోచుకోలేదు.) థమైరిస్ అనే లిరిక్‌గేయ నాటకాన్ని 1887లో రచించేను. దీనివల్లా, బ్రెన్‌హిల్డ్ వల్లా నాకు జీవితాంత పింఛను రాష్ట్రపరంగా దక్కింది. 1887 అక్టోబరులో నేను హ్యాసింగర్ మేనకోడలైన ఎయుగెమా బెన్డిక్స్‌ను వివాహమాడి హెల్లెరప్‌లో నివాసమేర్పరచుకొన్నాను. హగ్బార్గ్ ఒగ్ సిగ్నె (హెగ్బార్ట్ అండ్ సైనె) అనే లిరికల్ విషాదాంత నాటకాన్ని 1888లో, మిన్నా నవలను 1889లో, మిన్ కేర్లిగ్డెడ్స్ బోగ్ (ది బుక్ ఆఫ్ మై లౌ) అనే పద్య సంకలనాన్ని 1889లో, హెర్మన్ వాండెల్ నాటకాన్ని 1891లో, 1893లో వుర్లి లియాన్ అనే నాటకాన్నీ (ఈ నాటకం డేగ్మార్ నాటక శాలలో నూరుసార్లు ప్రదర్శితమైంది) హెల్లెరప్‌లోనే రచించేను. అక్కడే వేగ్నర్‌గారి నిబుల్జెరింగ్‌పై వ్యాసాన్నీ; యెడ్డా దైవ గీతాల అనువాదాల్నీ చేసేను.

1892 మార్చిలో డ్రెస్డెన్‌లో స్థిరపడ్డాను. కాంగ్‌హిజార్నె (కింగ్‌హిజార్నె) (1893) అనే సుఖాంత నాటకం, గిస్ట్ ఒగ్ నొడ్‌గిస్ట్ (టాక్సిన్ అండ్ ఏంటీ టాగ్జిన్) (1898) అనే పద్య నాటకమూ డేగ్మార్ నాటకశాలలో ప్రదర్శించేరు. ఫెబ్లె (ఫేబ్‌ల్స్) ఫ్రా వార్ టిల్ల్ హోస్ట్ (ఫ్రమ్ స్ప్రింగ్ టు ఆటమ్); టు ఫ్రేగ్మెటెర్ (టూ ఫ్రేగ్మెంట్స్) అనేవీ దరిమిలా అక్కడే రచించేను. డేనిష్ కవితా రచనకు వీడ్కోలు పలికేను. మిల్లెన్ (ది మిల్) 1896లో, వెడ్ గ్రన్సెన్ (ఎట్ ది బోర్డర్) 1897లో, టంకేలాసెరెండిన్ (ది స్కాట్లీ సేయర్) 1901లోనూ రచించేను. ఇవన్నీ నవలలు. చివరిదీ; రుడోల్ఫ్ స్టైన్స్ లేండ్‌వాక్సిస్ లేకరైఫ్ ఫర్ డాస్ లెబెన్ (రైప్ ఫర్ లైఫ్) ని 1913లో జర్మనీ భాషలో రచించేను. ఈ భాషలో నేను తొలిగా పేస్టర్ మార్స్ అనే రచన 1894లో చేసేను. ఇప్పుడీ భాష నాకు కళాభివ్యక్తీకరణకు మాధ్యమికంగా ఉంది.

నేను జర్మనీ భాషలో రచించిన నాటకాలైన డై ఒఫ్‌ఫెర్‌ఫ్యూరర్ (ది సేక్రిఫిషియల్ ఫైర్స్) 1903లో, (ఇది డ్రెస్డెన్, డెసాయూ సభా నాటక శాలలో ప్రదర్శితమై మన్ననలందింది!); దాస్ వైబ్‌డేస్ వాల్లెన్ డెటెన్ (ది వైఫ్ ఆఫ్ ది పెర్ఫెక్ట్ మేన్) 1907లో (ఇది స్టుట్‌గార్ట్ రాజ సభా నాటకశాలలో ప్రదర్శితమైంది) రచించేను.

జర్మనీ భాషలోనే రచించిన పద్య నాటకాలైన 1906 రచన డెర్ పిల్గర్ కామనీత (ది పిలిగ్రిమ్ కామనీత); డైవెల్‌ర్ వోండరర్ (ది వరల్డ్ వాండరర్స్) 1910లో రచన; డెర్‌గోల్డెనె ట్వెన్ (ది గోల్డెన్ బోగ్) అనే 1917 నాటి రచనా; డిక్‌గోట్టెస్ ఫ్రెన్నుడె (ది ఫ్రెండ్స్ ఆఫ్ గాడ్) అనే 1916లోని రచనా జర్మనీ భాషలో ఉదాత్త సాహితీ రచనలైనాయి. అంతేకాదు రెల్ప్ ఫర్ డాస్ లెబెన్ లాగా అందరికీ అవగాహన అవుతూ మెప్పు పొందేయి. ఏభై ఏళ్ళ క్రితం నాటి నా రచన జర్మన్ ఆదర్శవాద ప్రభావంతోనే వెలువడింది. దానికి మూడేళ్ళ తర్వాత (నా థీసిస్‌కి స్వర్ణపతకం వచ్చేక) నేను ఆంగ్లేయ వాస్తవిక వాదానుయాయిని. ఆ తర్వాత - నాకింతటి ఉన్నతిని కలుగజేసిన, అసలు నా ఉనికికే కారణమైన జోడియక్‌లోకి తిరిగి వచ్చేసేను. ఈ నా అసలైన ఉనికిని చేరిన తిరుగు ప్రయాణంలో నా పాలిటి మార్గనిర్దేశక ధృవతార ఎన్ ఇడియిల్లేస్ట్ లోలాగా హెగెల్ కాక; కాంట్, స్కోపెన్ హెటియర్గ్‌లు.

(కార్ల్ అడాల్ఫ్ గెల్లెరప్ 1919లో డ్రెస్డెన్‌కి సమీపాన ఉన్న క్లొట్జెస్కేలో పరమపదించేరు.)

# హిందూయిజం-ఒక పరిశీలన

మూలం: తర్క తీర్థ లక్ష్మణ శాస్త్రి జోషి          తెలుగు: డా॥ ఎన్. ఇన్నయ్య

*(గత సంచిక తరువాయి)*

## శంకర మాయావాద ఓటమి

వైజ్ఞానికంగా శంకరుడు ఉన్నత స్థాయివాడు. వివిధ తత్వాలను నిశితంగా క్షుణ్ణంగా పరిశీలించాడు. వాటి లోపాలను విడమరచి చూపాడు. విశ్వానికి సంబంధించిన సిద్ధాంతాల్లోని లోపభూయిష్టత నిర్ధారితమైంది. తన బ్రహ్మ సిద్ధాంతాన్ని కూడా తార్కికంగా రుజువు పరచలేనన్నాడు. ఆత్మ స్వభావం, పునర్జన్మ వంటివి వివేచన ద్వారా నిరూపించ జాలమన్నాడు. ఒకదశలో సత్యాన్వేషణ, విశ్వాన్వేషణ ఆగిపోయింది. కనుకనే మాయావాదం అవసరమైంది. విశ్వ స్వభావాన్ని వర్ణించలేం. ప్రత్యక్ష, పరోక్షాలని యిదమిద్ధంగా చెప్పలేం. కనుకనే భ్రాంతి అనాలి. అయితే ఈ భ్రాంతి కూడా శృతి ఆధారంగా తప్ప, శంకరుడు రుజువు చేయలేదు. బ్రహ్మ ఒక్కటే సత్యమని శృతి వాక్కు గనుక, విశ్వం మాయ అనటానికి వీల్లేకపోయింది. వివేచనతో చూస్తే శంకరుని మాయావాదం కూడా ఓటమి అంగీకరించక తప్పలేదు. వైజ్ఞానికంగా ఈ విషవలయాన్ని హిందూతత్వం ఛేదించలేక పోయింది.

బ్రహ్మ సిద్ధాంతం, మాయావాదం, మతసంస్థలు అనేవి నిశిత పరిశీలనకు నిలబడవని తెలిసిన శంకరుడు శృతి ప్రమాణంపై ఆధారపడ్డాడు. ఉపనిషత్తుల కాలం నుండీ వస్తున్న ఆలోచన, తత్వాన్ని వేద ప్రమాణం పేరిట శంకరుడు పాతిపెట్టాడు. మానవుడు వివేచనతో వాస్తవాన్ని పరిశీలించటమే తత్వం. వేదాలవలన యీ నిశిత పరిశీలన కాస్తా అడుగంటింది. వేదాలు సృష్టించిన వివేచనే సంపూర్ణమంటూ శంకరుడు వివేచనకు అడ్డుకట్టవేశాడు. ఇందులో ఆశ్చర్యం లేదు. స్థాణువుగా ఉన్న సమాజానికి అదే మంచిదనుకున్నాడు శంకరుడు. వైజ్ఞానిక ఆలోచనకు అనుగుణంగా సమాజం ఉన్నట్లయితే, శంకరుని తత్వం వలన కొత్త ఆలోచన, కొత్త తత్వం ఆవిర్భవించేవి. ఆధ్యాత్మిక తత్వాన్ని నిశితంగా పరిశీలిస్తే ఫలితం మరోవిధంగా వుండదు. శూన్యవాదం, మాయావాదం, సందేహవాదమైనా రావాలి, లేక ఉన్నత దశలో హేతువాదం, పదార్థవాదం పెంపొందాలి. అట్లాంటి వైజ్ఞానికాభివృద్ధికి సమాజ పరిస్థితులు అనుకూలించలేదు. ప్రత్యామ్నాయంగా మాయావాదం జనించి, మానవ విజ్ఞానం వృధా అయింది. సమాజం పతనమౌతుంటే తత్వం ఏం చేస్తుంది? కలలు గనటం తప్ప! ఈ మాయావాదమే, ముస్లింలు, మహారాష్ట్ర పీష్వాలు, బ్రిటిష్ వారి పరిపాలనలోనూ కొనసాగింది.

## హిందూయిజంలో కొత్త మార్పులు

విజ్ఞాన శాస్త్రాల తోడ్పాటుతో పాత ఆచారాలను అనేకమంది పండితులు బ్రిటిషువారి పాలన కాలంలో వలె, ఇప్పుడూ సమర్థించే ప్రయత్నాలు చేస్తున్నారు. భారత జాతీయ వాదానికి ఈ

డా॥ ఎన్. ఇన్నయ్య, హైదరాబాదు, హేతువాద రచయిత, ప్రముఖ పాత్రికేయులు.

సంప్రదాయాలను తిరగదోడే ప్రయత్నమే ఆధారమయింది. జాతీయవాది ఈ ఆచారాలను గౌరవిస్తున్నాడు. ఆధునిక జాతి సిద్ధాంత పరంగా కులాన్ని గూడా కొందరు సమర్థిస్తున్నారు. వర్ణాలు, కులాలు, ఆధారంగానే మానవజాతిని నేడు కూడా వర్గీకరించినట్లు తప్పుడు వాదన చేస్తున్నారు. కాని వర్ణానికీ, కులానికీ జీవలక్షణాలతో సంబంధం లేదు. వాటినాధారంగా బ్రాహ్మణుడెవరో, శూద్రుడెవరో నిర్ధారించటం అసంభవం. శృతి, స్మృతులలో చిత్రించినట్లు మానసిక లక్షణాలు కూడా కారణం కాదు. ఆర్యులకు జాతి ఆధిక్యత పట్ల గర్వం జాస్తి. ఆర్య నాగరికతకూ, జాతికీ అట్టే సంబంధం లేదు. ఆర్య సంస్కృతి అంతా ఒకేజాతికి చెందింది కాదు. భిన్న జాతులలో ఆ లక్షణాలున్నాయి. వేద సంప్రదాయాలను సజీవంగా నేటికీ అట్టిపెట్టిన తెలుగు బ్రాహ్మణులకు, శూద్రులకు జాతి పోలికలున్నాయి. దక్షిణాది బ్రాహ్మణులకు, ఉత్తరాది చర్మకారులకు పోలికలున్నాయి. ఐరోపా, మధ్య ఆసియా, ఆస్ట్రేలియా, చైనాలలోని జాతులు మన దగ్గర ఉన్నాయి. ఆర్యులు ఆటవికంగా ఉన్నప్పుడు చైనా, ఈజిప్టు, క్రేటే, పాలస్తీనాలలో నాగరిక జాతులెన్నో ఉన్నాయి. ఆర్యులు తమ ఆటవికత్వంలో ఉన్నత నాగరికతను నాశనం చేసిన సందర్భాలున్నాయి.

కనుక చాతుర్వర్ణాలకు, జాతులకు సంబంధం లేదు. ఉత్పత్తి పద్ధతులలో మార్పులు వస్తే సంస్కృతి కూడా మారుతుంది. బ్రిటిషు వారికింద క్షత్రియులు శూద్రులయ్యారు. ఆంగ్లేయులకు ఉత్తమ ఆయుధాలుండటమే ఇందుకు కారణం. అట్లాగే పూర్వం గుర్రం వాడకంలోకి వచ్చింతరువాత, సాహసోపేతులు కొందరు అజ్ఞానులను ఓడించి, శూద్రులను చేసి తాము బ్రాహ్మణులుగా, క్షత్రియులుగా మారారు. సామాజిక పరిస్థితుల మార్పే బ్రాహ్మణ, క్షత్రియ, శూద్రులు గావటానికి కారణం. ఇందులో వర్ణ లక్షణాలకు సంబంధం లేదు. బ్రాహ్మణ, శూద్ర జీవితాలు, వర్ణ లక్షణాలతో ముడిపడి ఉన్నట్లు చరిత్రలో ఆధారాలు లేవు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర లక్షణాలు ఒకే వ్యక్తిలో ఉండటం అసంభవం కాదని రుజువయింది.

బ్రిటిషు పాలన కింద హిందూ సమాజంలో అనేక మత సంస్కరణోద్యమాలు తలెత్తినాయి. పరాయి పాలన ప్రభావంలో సమాజ జీవితంలో ఎంతో మార్పు జరిగింది. కొత్త విజ్ఞానం, యంత్రాలు, ఉత్పత్తి సాధనాలతో వచ్చి దేశాన్ని పాలించిన ఇంగ్లీషువారు ఇక్కడ సామాజిక జీవితంపై ప్రగాఢ ముద్ర వేసారు. దేశ, విదేశ భావాలకు, ఆలోచనకు, పొందిక లేనందువలన మన సంప్రదాయాలను సంస్కరించటం ప్రారంభించారు. తత్ఫలితంగా బ్రహ్మసమాజం, ఆర్యసమాజం ఆవిర్భవించాయి. వివిధ విశ్వాసాలకు తత్వాలకు స్థానం ఇవ్వని బ్రహ్మసమాజం ఏకేశ్వరాధనపై నొక్కి పెట్టింది. నీతి, సత్ప్రవర్తన కావాలన్నది. కొద్దిమంది చదువుకున్న పట్టణవాసులకు పరిమితమైన బ్రహ్మ సమాజం అట్టే కాలం ప్రభావాన్ని చూపెట్టలేక పోయింది. ఆర్యసమాజం ఉత్తర హిందూ స్థానంలో ముఖ్యంగా పంజాబులో చాలా ప్రభావం చూపెట్టింది. ఈ సంస్కరణ వాదులలో ఒక వర్గం హేతుబద్ధంగానూ, మరొకరు మతపరంగానూ కొనసాగారు. హేతువాదులు నూతన విజ్ఞానం దృష్ట్యా పాత సంప్రదాయాలను, ఆచారాలను పట్టణాలలో పునర్వ్యవస్థీకరించటం ప్రారంభించారు. బాల్య వివాహాలు నిషేధించటం, విధవా పునర్వివాహం, వివాహ వయః పరిమితి,

ఆహారానికి సంబంధించిన వివిధ నిషేధాలు సడలించటం హేతువాదుల సంస్కరణలలో ముఖ్యమయింది. కాని మత సంస్కర్తలు హేతువాదుల్ని వ్యతిరేకిస్తూ చౌకబారు ప్రచారం కోసం, సనాతన సంప్రదాయాలను సమర్థించారు. వివేకానంద, రామతీర్థ, తిలక్, గాంధీ, డా॥ రాధాకృష్ణన్ సనాతన హిందూ తత్వానికి నగిషీలు చెక్కి ఆధునికంగా చూపెట్టే ప్రయత్నం చేశారు. హేతుబద్ధమైన సంస్కరణ వీరిలో కించిత్తయినా లేదు. దివ్యదర్శనం, యోగదర్శనం, పునర్జన్మ ఇత్యాది మార్మిక సిద్ధాంతాలకు వీరంతా మద్దతుదారులు.

ఆర్యసమాజం వేదప్రమాణం ఆధారం చేసుకొన్నది. శృతులు, స్మృతులు, పురాణాలను నిరాకరిస్తుంది. వేదాలలోనూ, బ్రాహ్మణాలను అంగీకరించరు. మంత్రాలే అసలైన వేదమని వారి నమ్మకం. బ్రాహ్మణాలలోని కర్మకాండ ఆమోదయోగ్యం కాదని నేడు భావించబడింది. వేదాలను వ్యాఖ్యానించిన దయానందుడు ఏకేశ్వరాధనపై ఎక్కువగా నొక్కిపెట్టాడు. యజ్ఞాలలోని జంతు బలులన్నీ కేవలం సూచన ప్రాయాలన్నాడు. దయానందుడి దృష్టిలో వేదాలు సర్వాధికారాలు, తుది నిర్ణయాలు.

పాత వేద భావాలకు ఆధునిక తొడుగు వేయటం వృధా. ఆర్యసమాజం ఇస్లాంకు వ్యతిరేకంగా ఆవిర్భవించింది. 12వ శతాబ్దంలో అరబ్బులకు మహమ్మదు ఒకే దేవుడు, ఒకే మతం, ఒకే గ్రంథం అని చెప్పిన సందేశం నేడు ఆర్య సమాజం తిరగతోడటం నిష్ప్రయోజనం. వేదాలను తిరగతోడితే హిందువులు మళ్ళీ వికశిస్తారనీ, శక్తివంతులవుతారనీ కొందరంటున్నారు. హిందువుల బలహీనత, పిరికితనం, బుద్ధుని అనంతరం జనించింది కాదు. శక్తివంతమైన హిందూ సామ్రాజ్యాలు అప్పుడూ లేకపోలేదు. జీవితాన్నీ, విశ్వాన్ని సంకుచితంగా, భ్రమగా భావించిన వేదాలను తిరగతోడినందువలన హిందువులు యింకా శక్తి హీనులవుతారు. ఆధునిక విజ్ఞానం ఆలోచనలతో ఏమాత్రం పొసగని వేదాలు నేడు అనవసరం. వేదాలు నాటి సామాజిక పరిస్థితులకు ప్రతిబింబాలు. వాటికి చారిత్రక ప్రాధాన్యత మాత్రమే ఉన్నది. అంతేగాని ఆధునిక జీవితానికి వేదాలను ఆదర్శంగా చేద్దాం అనటం వెర్రిమాత్రమే. చదువుకున్న కొందరు గీతలో సెక్యులర్ దృక్పథం పట్ల ఆకర్షితులైనారు. నూతన హిందూ యిజానికి అందులో సందేశమున్నదంటూ అనేకులు వ్యాఖ్యలు, విమర్శలు చేశారు. గీతను ప్రామాణికంగా అంగీకరించటమా, హేతుబద్ధంగా చూడటమా అనేది ప్రశ్న, పరస్పర విరుద్ధ భావాలు అనేకం గీతలో ఉన్నాయి. పునర్జన్మ, ఆత్మ, దైవం, కర్మసిద్ధాంతాలు హేతుబద్ధం చేయటం అసంభవం. వివేచనాత్మకుడు గీతను ఆమోదించలేడు. గుడ్డి నమ్మకంలోనే వీటిని అనుసరించాలి.

మన సమాజం స్థంభించి ఉన్నది. దీన్ని పునర్నిర్మించటానికి, పురోగమింపచేయటానికి ఆలోచన జరగాలి. దీనికి గీత ఏమి చేయగలదు? ఆధ్యాత్మిక, ఆముష్మిక మాటల్లో అర్థం లేదు. సామాజిక గతిశీలతకు సంబంధించిన విజ్ఞానం శాస్త్రం కావాలి. నిష్కామ కర్మను గురించి గీత చెపుతుంది. కాని ఫలితాలను బట్టి కర్మ నిర్ధారితమౌతుంది. సంప్రదాయ బద్ధం దోషపూరితాలని భావించబడిన చర్యలు హేతుబద్ధంగా రుజువు చేయాలి. గీత అందుకు ఉపకరించదు. సమాజ

విజ్ఞానం మాత్రమే ఉపకరిస్తుంది. గీత ప్రవచనాలు పురాణాలను పోలినవి. అందులో తర్కం, తులనాత్మకత లేదు. కనుక గీత ఆధునిక సమాజానికి ఉపకరించదు.

కులం హిందూయిజానికి ప్రధాన లక్షణం కాదని, ఇంకా ఉన్నత లక్షణాలున్నాయని కొందరు వృధా అన్వేషణ చేస్తున్నారు. ఆ కృషిలో కొత్త హిందూ యిజాన్ని తీసుకొస్తున్నారు. అంతేగాని ప్రాతిపదికల మూల స్వరూపాన్ని పరిశీలించటం లేదు. కొత్త మతాలకు మళ్ళీ పాత ప్రమాణ గ్రంథాలే ఆధారం. హేతువాదం ప్రబలితే మతం అదృశ్యమౌతుంది. అలౌకికంలో నమ్మకమే మతానికి ప్రాతిపదిక. ప్రమాణ రహితంగా మతం ఉండదని గ్రహించిన దయానంద వేదాలను, తిలక్ గీతను ప్రమాణంగా స్వీకరించారు.

దేవుడు, ఆత్మ, కర్మ వీటన్నిటికీ జీవితంలో విలువ ఉన్నదనే కొందరు వాదిస్తారు. కాని జీవన్మరణ సమస్యలు వచ్చినప్పుడు వీటితో నిమిత్తం లేకుండానే మానవుడు పోరాడినట్లు చరిత్ర రుజువు చేసింది. దేవుడిపై విశ్వాసం లేకుండానే శాస్త్రజ్ఞులు పరిశోధన చేస్తున్నారు. మానవాళి మనుగడకు, సత్యాన్వేషణకు శాస్త్రజ్ఞుడు నిరంతరం కృషి చేస్తున్నాడు. తల్లి తన బిడ్డకు సేవలు చేసేటప్పుడు దేవుణ్ణి దృష్టిలో పెట్టుకొని గాని, ముక్తి కోసం గాని చేయదు. కోట్లాది ప్రజల సంక్షేమానికి, పురోగతికీ, కృషి చేసే పదార్థ వాదం అత్యున్నత తత్వం, ఆయా సామాజిక పరిస్థితుల్లో చారిత్రక కారణాలాధారంగా జనించిన వాటికి శాశ్వత విలువలను అంటకట్టడం హాస్యాస్పదం. మతం వాటికి దైవత్వాన్నీ కూడా ఆపాదిస్తుంది. ఈ శాశ్వత విలువలే పతనానికి దారితీస్తున్నాయి. మానవుడు సృష్టించిన మతము, దేవుడు చివరికి అతన్నే పాలిస్తున్నాయి. కనుక వివేచనాత్మక ఆదర్శాలే ఉపయోగం. అదీగాక ఆధ్యాత్మిక విలువలు ఇన్నాళ్ళూ పెత్తందారీ వర్గాలకు అనుకూలంగా తోడ్పడుతూ వచ్చాయి. అణగారిపోయినవారి బానిసత్వాన్ని మత విలువలు అట్టిపెట్టాయి. తమ ఆధిపత్యాన్నీ ప్రత్యేక అవకాశాన్నీ వినియోగించుకోటానికి పెత్తందారీ వర్గాలు ఈ విలువలను వాడుకున్నాయి. అంటరానితనం, కులం ఇత్యాది అన్యాయ విధానాలను అట్టిపెట్టింది మత విలువలే.

మత నమ్మకాలన్నీ అజ్ఞానం వలన, భ్రాంతివలన ఊహించబడినవే. వాస్తవాన్ని వక్రంగా చిత్రించటం, స్వర్గ - నరకాలు, దేవుడు, పునర్జన్మ, కర్మ ఇట్లాంటివన్నీ మత భ్రమలే. విజ్ఞాన శాస్త్రం వినయంగా తెలియని విషయాలను అంగీకరించి, క్రమేణ తెలుసుకోటానికి ప్రయత్నిస్తుంది. మతానికి అహంకారం తప్ప వినయం లేదు. ఎందుకు, ఎట్లా అనే ప్రశ్నలు ఉపనిషత్తుల్లో, దర్శనాల్లో ఒకటి రెండు చోట్ల మినహా, మరెక్కడా కనిపించవు. మత భ్రమలన్నీ దోషపూరితాలని విజ్ఞాన శాస్త్రం రుజువు చేసింది. మనిషికి మతమిచ్చిన స్థానం కూడా విజ్ఞాన శాస్త్రం మార్చివేసింది. నేడు మతం కంటే ఉన్నతమైన సామాజిక సంస్థలు ఆవిర్భవిస్తున్నాయి. ఒకప్పుడు మతం నిర్వహించిన పాత్రను నేడు అత్యున్నత స్థాయిలో ఇతర సంస్థలు నిర్వహిస్తున్నాయి.

వ్యాసుడు నిరాకరించిన స్థానాన్ని బుద్ధుడు మళ్ళీ మానవునకు కల్పించాడు. నేడు గతం వైపే ఆశపెట్టుకున్నవారికి భవిష్యత్తు లేదు. నూతన యుగానికి కావలసిన కొత్త ఆదర్శాలు మాత్రమే మానవుడి అభివృద్ధికి తోడ్పడగలవు. గతం అనేది అభివృద్ధి పథంలో ఒక మెట్టు కావాలి. అప్పుడే ఉజ్వలమైన భవిష్యత్తు ఉంటుంది.

(సమాప్తం)

# చేరాపై రాతలెందుకని ... !?!

- చంద్రలత

పదాలు పువ్వుల కొరడాల లాంటివి.

వాక్యాల్లోకి ఒదుగుతూ ... భావోద్వేగాల్ని పొదుగుతూ ...

పలకరిస్తూ ... పరామర్శిస్తూ ...

పరీక్షిస్తూ ... పరిచయం చేస్తూ ...

విమర్శిస్తూ ... విపులీకరిస్తూ ...

వెన్ను తడుతూ ... వెన్నంటి నడుస్తూ ...

భాసిస్తూ ... 'భాషి'స్తూ

విరబూసిన ఆత్మీయ పదాలు...

చేరా రాతలు.

భాషతో చెలిమి చేస్తూ ... చెట్టాపట్టాలు వేసి తిరుగుతూ... గాలివాటున నేలరాలిన పూల సౌగంధాలనూ ... మొగ్గ విచ్చుతోన్న కుసుమ సౌరభాలనూ, విప్పారిన పుష్ప సౌందర్యాన్నీ ... ఆస్వాదించి... అపురూపంగా సేకరించి ... గుదిగుచ్చి ... ఆ సుమహారాన్ని ఆప్యాయంగా మనకు అందించిన పెద్దలు ... పసి వాడని ...

చేరా.

ఎందరెందరి రాతలనో తిరగరాసిన, తిప్పి తిప్పి తిరుగమోత వేసిన చేరాపై రాతలెందుకని ?

సాహిత్యంలో లక్షవైవిధ్యాలుంటే సాహితీ విమర్శలో సవాలక్ష వైరుధ్యాలుంటాయి.

భావ వ్యక్తీకరణకు సాహిత్యం ఓ స్వేచ్ఛా మాధ్యమం.

స్వంతంగా స్వతంత్రంగా వ్యక్తమయ్యే భావానికి కొలమానం ఏమిటి? తప్పేమిటో ఒప్పేమిటో తూకం వేయడమేమిటి? స్వరూప స్వభావాల పరిమితులేమిటి? నియమ నిబంధనాల పరిధులేమిటి?

ఏమిటీ దబాయింపు?

మరలాగే - కానీ - క్షీరనీర న్యాయం జరిగేదెట్లా? అకవుల మెడలో గంట కట్టేవారెవరు?

వారు -

అకవిత్వం నుంచి కవిత్వాన్ని వేరు చేయడం - తిరోగమన వాదుల నడ్డి విరచడం - దారి తప్పిన వారిని ఛళ్ళున చరచడం - స్వార్థ సంకుచితాల నుండి సాహిత్యాన్ని సాహితీ విమర్శను తప్పించడం. వ్యక్తి దూషణ నుండీ వర్గ ద్వేషం నుండీ రచనను కాపాడడం - ఇలా ఎన్నెన్నో చేయవలసి ఉంది.

---

చంద్రలత, సిమ్స్ సెంటర్ ఫర్ చైల్డ్ హెల్త్, పొగతోట, నెల్లూరు - 524 001.

అంతేనా?

భిన్న సంకుచితాలతో సాహితీరంగంలో ఏర్పడిన వివిధ పీఠాల బారి నుండి - ఆ పీఠాధిపతుల బారి నుండి - స్వేచ్ఛాగళం కుత్తుకలుత్తరించే 'ముద్రా' రాక్షసం (Branding) బారి నుండి - నలగ నీయక, అయోమయంలోకి జారనీయక - కొత్త కలాలకు ఒక సంయమన విమర్శా పద్ధతిని పరిచయం చేయాల్సివుంది.

అన్నిటికీ మించి -

ప్రజాస్వామ్య భావాలను మానవ విలువలను ప్రతిష్ఠించాల్సి వుంది.

మానవ స్పృహతో, మానవ స్పర్శతో

మళ్ళీ మళ్ళీ

అప్పుడే కదా -

ఉన్నత సాహితీ ప్రమాణాలను సాధించే వీలు కలుగుతుంది.

ఉత్తమ సాహితీ సృజనకు ఊపిరి సలుపుతుంది. సాహితీ సౌజన్యం సర్వబాహుళ్యమవుతుంది. సరిగ్గా అలాంటి సౌహార్ద్ర వాతావరణాన్ని, సాహితీ ప్రమాణాన్ని అందించాయి చేరా రాతలు. అవి చేరాతలైనా, చేరా పీఠికలైనా, తెలుగు వాక్యమైనా, లక్షణ చర్చయైనా, ముత్యాలసరాల ముచ్చట్లయినా, అనుభవాల దొంతరలైనా, అధ్యయనాల పాఠాలైనా, జ్ఞాపకాలతో కాచిన కాయలైనా.

జగమెరిగిన సాహితీ పెద్ద చేరాకు ప్రత్యేక పరిచయం అవసరం లేదు.

ఒక కవిగా కళ్ళు తెరిచి, భాషాధ్యయనం చేస్తూ, పరిశోధిస్తూ, ప్రతిపాదిస్తూ - అటు సాహితీ విమర్శకునిగా ఇటు భాషా శాస్త్రజ్ఞుడిగా ప్రసిద్ధికెక్కారు శ్రీ చేకూరి రామారావు గారు.

ప్రమాణికమైన చేరా రాతలు ఎన్నో కొత్త కలాలకు అండగా నిలిచాయి. కొత్త కొత్త వాదనలు, ధోరణులు, సిద్ధాంతాలు మూర్తిమంతం పొందడానికి మూలమయ్యాయి. ప్రాచీన, ఆధునిక, అత్యాధునికి సాహిత్యాన్ని, సాహితీవేత్తలను వారి ప్రత్యేక స్థానాల్లో నిలబెట్టాయి.

చేరా ఏ ఒక్క పరిమిత ధోరణికీ లోబడి లేక పోయినా? ఏ శిబిరం లోనూ చేరక పోయినా!

ఇది సాహితీ సత్యం.

చేరాది మానవ స్పృహ. విపుల తత్వం. ప్రజాస్వామ్య దృక్పథం. అంతర్జాతీయ దృష్టి.

కొండొకచో చేరా హృద్యతను మెట్టులా చేసుకొని కొండెక్కి కూర్చున్న సాహితీ రాజులు, రాణులు చేసిన పిల్ల చేష్టలకు ఆయన నవ్వేసి ఊరుకోవడమే కానీ సాహితీ ద్వేషం ప్రకటించిన దాఖలాలు లేవు.

సాయం కాలం కలిసి కాస్సేపు కాలక్షేపం చేసి ఆ 'కాస్త' రాయించుకోవచ్చు నంటూ చేసిన గాలి ప్రచారాలకూ ఆయన అంతే తేలికగా నవ్వేసి ఊరుకోలేదూ?

దుయ్యబట్టినా - దుమ్మెత్తి పోసినా - శాపనార్థాలు పెట్టినా - హేళన చేసినా - మనసు విరిచినా - చేరా విమర్శలో ప్రజాస్వామ్య దృష్టినీ, నిజాయితినీ, నిబ్బరాన్ని విడవలేదు.

అందుకు కొండ లాంటి గుండె కావాలి. మేధోప్రజ్ఞతో పాటు మానస సంస్కారం కావాలి. పండిన విద్వత్తుతో పాటు పసిపిల్లవాడిలా స్పందించగల నిష్కపటమైన మనస్సు ఉన్నాయి కాబట్టే చేరా ఉత్తమ సాహితీ విమర్శకుడు కాగలిగారు. ఎలాంటి పటాటోపం లేకుండా కొత్తగొంతులతో గళం కలపగలిగారు.

ఇదీ చెరగని అక్షరాలతో చేరాసిన చేరాతల ప్రాధాన్యత.

రాయడానికి ఒక్క కారణమే ఉండొచ్చు.

రాయలేకపోవడానికీ ఒక్క కారణమే ఉండొచ్చు.

'గొప్ప కవి అయి ఉండొచ్చు. గొప్ప విమర్శకుడు అయి ఉండొచ్చు' ద్వారకానాథ్ గారి లాగా టి. టి. ఐ. లా మిగిలి అజ్ఞాతంలోకి అంతర్థామై పోయి ఉండొచ్చు.

జగడం లక్ష్మీ నారాయణ గారిలాగా 'గనుల్లో పర్సనల్ ఆఫీసర్' లా మిణుకుతూ ఉండొచ్చు.

రచయిత్రిని మింగిన రాజకీయాల్లో మిగిలిపోయి ఉండొచ్చు.

తెలంగాణా విప్లవోద్యమ మలిదశను ఖండ కావ్య కుసుమాలుగా వికసింపజేసి - సాహిత్య చరిత్ర కారుల దృష్టిలో సముచిత స్థానం పొందని గంగినేని వెంకటేశ్వరరావు గారి లాంటి సాహితీ వేత్తలు కావచ్చు.

కరకు పదాల దాపున పడిన సాహితీ విమర్శకుల సుతిమెత్తని హృదయం కావచ్చు.

గురువుగారికి ఉద్వేగంగా అందించే నివాళి కావచ్చు. చిన్ననాటి స్నేహాల చిలిపి గుర్తులు కావచ్చు.

రచనలతో పాటు సాహితీ వేత్తలతోనూ సహితీ బంధువులతోనూ చేరాకు ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఏర్పడిన ఆ మానవ సంబంధాలు... అవి నేర్పిన సంస్కారమే ఆయనలోని వెలుగు.

సాహితీ వేత్తలుగా ఎదగలేని ఎదగనీయని ఆ అనివార్య పరిస్థితులకు స్పందించిన ఆర్ద్రత సాహితీ చరిత్రకారుల మరుపులో మాయం అయిన మసక బారిన సాహితీ వేత్తల - ప్రాధాన్యతను గుర్తించిన శోధన - వృత్తి కాఠిన్యంలో వెలువడని కరుణార్ద్రతను గ్రహించగలిగే హృదయ స్పర్శ చేరా గారిది.

మానవ సంబంధాల పట్ల చేరాకు గల గౌరవం, ఆప్యాయత - తన బలహీనతలను తనే చెప్పుకోగలిగిన బలమూ - చేరాను మనకు మరింత సన్నిహితం చేస్తాయి.

''ఈ పుస్తకంలో చాలా అంశాలు నా పరిశోధన ఫలితాలయినా ప్రత్యక్షరమూ నా సొంతం కాదు. నాకంటే ప్రజ్ఞావంతులైన పూర్వుల ఆలోచనల పునాది బలం పైనే ఈ ఆలోచనలు సాగినాయి.''

ఈ చేరాత పాతికేళ్ళకు పైగా భాషా శాస్త్రంలో ప్రామాణిక గ్రంథంలా అధ్యయనం చేయ బడుతోన్న ''తెలుగు వాక్యం'' పీఠిక లోనిది.

ఎదిగిన వారు ఎంత ఒదిగివుంటారో తెలియడానికి ఆ ఒక్క చేరాతా చాలదూ?

చేరా రాస్తారు కదా -

''ఏ తరం వారయినా తమ వెనుకటి తరం వారికి ఋణపడి ఉంటారన్నది ఋజువు చేయక్కరలేని నిజం. ఎన్నటికీ తీర్చుకోలేని ఋణాను బంధం అది.''

ఆ విధంగా చేరా గారితో మనదెంత ఋణానుబంధం!

ప్రతి ఫలం ఆశించని ఈ సాహితీ బంధువు బదులుగా కోరేది ఆగకుండా రాయడాన్నే. రాస్తూ ఉండడాన్నే.

అయితే ఎలా పడితే అలా రాయడాన్ని కాదు. మొదట రాసిన దానికన్నా మరింత మెరుగుగా రాయడాన్ని. మరింత ఉన్నతంగా రాయడాన్ని.

'ఆ

రచనలో చెల్లదు. మానవ విలువల ఆంతర్యాన్ని ఆవిష్కరించడానికీ, నవరసాలను సముచితంగా చిత్రించడానికీ - జీవితాన్ని ప్రతిఫలించడానికి - విస్తృత అవకాశం ఉన్న నవల ఉత్తమ సాహితీ రూపం. నవలా రచనకు ఎంతో అధ్యయనం, అవగాహన కావాలి. రచన చేయ గలిగిన ఉత్సాహం ఒకటే చాలదు. నవలా రచయితకు దీక్షా దక్షతలతో పాటు నిజాయితీ నిబద్ధతలు ఎంతో అవసరం -'' చేరా గారు నాతో అన్నారు, ''ఆ అధ్యయనం అన్ని కోణాల్లోంచి మూలాల్లోకి జరగాలి. ఎంచుకున్న విషయాన్ని ఎంతగా అర్థం చేసుకొంటే అంతటి అర్థవంతమైన రచన చేయగలరు. ఉత్తమ రచనకు వేరొక అడ్డదారి లేదు. సునిశిత పరిశీలన, నిరంతర అధ్యయం తప్పని సరి.''

చేరా స్వయానా నిరంతర పాఠకుడు.

కవిత్వం చదివినంత ఆప్యాయంగానే సాహిత్యాన్నంతా చదువుతారు.

మొదట భావం కోసం. మరల భాష కోసం.

పదం నుంచి పాట వరకూ. వాక్యం నుంచి వ్యాసం వరకూ. కల్పిక నుంచి కథ వరకూ. నాటిక నుంచి నవల వరకూ. ప్రాచీనం నుంచి అత్యాధునికం వరకూ.

చేరా ఒక రచనను కవిలా చదవ గలరు. రసజ్ఞత పొంద గలరు.

ఒక విమర్శకుడిలా చదవగలరు. ఆంతర్యం గ్రహించగలరు.

ఈ భావుకుడైన పండితుడి పదసౌందర్యం, భావ సాంద్రత ఆయన ప్రత్యక్షరంలో ప్రత్యక్ష మవుతుంది.

ఈ మానస సంస్కారమే అంతః చేతనే ఆయన మానవ సంబంధాలలోకి ప్రసరిస్తుంది.

ఆయన జ్ఞాపకాల చిరుజల్లులలో జడివానలో పిడుగు పాటులో తడిచిన వణికిన దడిచిన మనకూ ఆయన పట్ల సాన్నిత్యం కలుగుతుంది. గౌరవం పెరుగుతుంది. కిణాంకమై మిగులుతుంది.

''ఇచ్చట పీఠికలు రాయబడును. సమీక్షలు చేయబడును.'' అంటూ ప్రకటనలు ఇవ్వకపోయినా చేరా ఇంటికి కొని తెచ్చుకున్న మొహమాటాలెన్నెన్నో! నిందలలో నిష్ఠూరాలలో నిలువునా తడుస్తూ!

ఒకమారు ఆయన ముందు ఓ పెద్ద కాగితాల కట్ట పెట్టుకు కూర్చున్నారు. ఆరాతీస్తే - అవి ఎవరో కాలమిస్టు మిత్రుడు రచించిన వందలాది, బహుశా వేలాది, కాలమ్స్ కవిలకట్ట.

ఆ వేలాది చిరిగిన చెదిరిన నలిగిన కాగితాల నుండి ఓ వంద ఉత్తమ రచనలను ఏర్చి కూర్చి పెట్టమని చేరాను కోరారా మిత్రుడు. పనిలో పనిగా పీఠికా రాయమని! ఆ తరువాత సమీక్ష చేయమని.

చేరా గారు అప్పటికింకా 'గుండె కోత' నుండి తేరుకున్నట్లు లేదు!

ఈ వ్యవహారమంతా వారి శ్రీమతి గారికి గుండెకోతగా పరిణమించింది!

స్నేహ బంధం పట్ల గౌరవం కొద్దీ మొహమాటం కొద్దీ ఆ పనిని చేరా సంతోషంగా చేయబూని ఉండొచ్చు కాక! ఇలాంటి కూర్పు కర్త పనేనా చేరా మేష్టారు చేయవలసింది? దాని వలన చివరకు మిగిలేది ఏముంది? మేష్టారి ఆరోగ్యానికి చెరుపు కాక! కుటుంబ సభ్యులకు వెరుపు కాక!

చేరా ప్రధాన కృషి ప్రత్యేక కృషి చేసింది చేస్తున్నది భాషా శాస్త్రంలో.

ఇది ఆయన ప్రత్యేకత, ఇదే ఆయన అసలు సిసలు ప్రత్యేకత.

ఇది ఆయనే చేయగలిగిన ఆయన పని!

ఈ రంగంలో చేరా జీవిత కాల కృషి ఇంకా అక్షర బద్ధం కాలేదు.

''అది నా బద్ధకమే-'' అంటూ పకపకా నవ్వేయడం చేరాకు అలవాటే.

హోంవర్క్ చేయడానికి పాలుమారిన పిల్లవాడు మాటమార్చేయ్యాలని నవ్వే నవ్వులు రువ్వుతూ.

ఆయనే చేయగలిగిన ఆయన పనిని చేసేట్లు చూడవలసిన బాధ్యత చేరాభిమానులమైన మనందరిదీ ... మాష్టారి చెవి మెలిపెట్టైనా సరే!

ఏనాడో రావలసిన అవార్డుల గౌరవం ఈనాటికైనా వచ్చింది.

ఈ సంతోషం మనందరిదీను.

చేరాకు జేజేలు

తడి ఇసుకలో అదాటున దొరికిన గవ్వ మీది రంగుల్ని చూసి సంబరపడే పిల్లవాడూ -

స్వేచ్ఛకూ చైతన్యానికీ - సూక్ష్మానికి స్థూలానికి - ప్రజ్ఞకూ విజ్ఞతకూ - సౌందర్యానికీ సౌజన్యానికీ నడుమ ఒక సమన్వయ ప్రమాణాన్ని చూపగల, పండు మేధావీ -

ఆయనలోనే ఉన్నారు.

మనందరికీ చేరువలో -

మన చేరా!

# పాట పాడడానికే కాదు వినడానికి కూడా అభ్యాసం కావాలి

– డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు

శాస్త్రీయ సంగీతానికీ లలిత సంగీతానికీ తేడా ఏమిటి? అని మా సంగీత మిత్రులొకరు ప్రశ్నించినప్పుడు జవాబు అన్వేషించే క్రమంలో తోచిన విషయాలను సంగీతజ్ఞులతో పంచుకోవాలనిపించి, ఈ వ్యాసం.

శాస్త్రీయ సంగీతాన్ని అభ్యాసం లేకుండా వినడం ఆనందించడం కుదరదు. వినడానికి అభ్యాసం అక్కర్లేకుండా లలిత సంగీతాన్ని ఆనందించొచ్చు. ఇదీ పై ప్రశ్నకు చటుక్కున తట్టిన జవాబు. కొంచెం వివేచిస్తే అది తప్పని తేలింది.

ఒక ఆఫ్రికన్ జాతి తాలూకు లలిత సంగీతాన్ని తెలుగువాడు తొలిసారిగా విని ఆనందించగలడా? లేదు కదా! అతనికి అది ఎబ్బెట్టుగా పరాయిదిగా ఉంటుంది. అలవాటు పడేదాకా ఆ బాణీ అతనికి వినసొంపుగా తోచదు.

అంటే ఏమిటన్న మాట? - తెలుగు వాడు తన ప్రాంతానికి చెందిన లలిత సంగీతాన్ని వినడానికి ఊహ తెలియని నాటి నుంచీ అలవాటు పడ్డాడు కనక అతను దాన్ని ఆనందించగలుగుతున్నాడు. చిన్నప్పటి నుంచీ శాస్త్రీయ సంగీతాన్ని వింటూ - ఇంట్లో సంగీతాభిమానో సంగీత విద్వాంసుడో ఉన్న - తెలుగు కుర్రాడు కర్ణాటక శాస్త్రీయ సంగీతాన్ని సుబ్బరంగా విని ఆనందించగలడు కదా!

కాబట్టి, భాషను విని అర్థం చేసుకోవడం ఎలా నేర్చుకున్నామో, అలాగే ఒక రకంగా, సంగీతాన్ని విని ఆనందించడం కూడా నేర్చుకోవాలన్నమాట.

అయితే, తెలుగువాడు బెంగాలీ లలిత గీతాన్నో, పంజాబీ లలిత గీతాన్నో ఆనందించడం లేదా దానికి ఏం చెబుతాం అని అడగొచ్చు.

తాను వినడానికి అలవాటుపడ్డ సంగీతపు బాణీకి ఈ కొత్త బాణీ, ఏ మేరకు దగ్గరగా ఉంటే ఆ మేరకు శ్రోత దాన్ని స్వీకరించగలడు. భారతీయ సంగీతంలో పైకి కనిపిస్తున్న భేదాలకు అడుగున ఒక ఏక సూత్రత, Common ground ఉన్నాయన్న మాట. మరోలా చెప్పాలంటే, భారతీయ సంగీతం అనే భాషకు కర్ణాటక, హిందుస్థానీ, బెంగాలీ మొదలైన సంగీత ధోరణులు మాండలికాల్లాంటివి.

సారాంశం ఇదీ - సంగీత రస గ్రహణానికి శ్రవణాభ్యాసం ఉండాలి - అది పాటైనా సరే.

---

డాక్టర్ ఆర్. ఎస్. వెంకటేశ్వర రావు, ప్రకాశం నగర్, రాజమండ్రి.

దీనికి ఉపబలకమైన మరో విషయం ఏమిటంటే - ఏ సినిమా సంగీతమూ హోరెత్తని కాలంలో తెలుగు పామరుడు నాటక పద్యాన్ని బాగా ఆదరించాడు. దాన్ని విన్నాడు, పాడుకున్నాడు. ఆ పద్యం మరాఠీ బాణీలో ఉందా కర్ణాటక శాస్త్రీయ సంగీతపు బాణీలో ఉందా? అన్నది అతనికి పట్టలేదు. పదే పదే వినడం వల్ల ఏర్పడ్డ పరిచయం వల్ల, చనువు వల్ల, సులువు వల్ల దాన్ని తనదిగా స్వీకరించగలిగాడు.

శ్రవణాభ్యాసానికి సంబంధించిన చర్చ ముగించే ముందు మరో సంగతి చెప్పుకోవాల్సి ఉంది.

సంగీతంలో రెండు అంశాలున్నాయి. రాగం, తాళం. వినడంలో చిక్కంతా రాగంతోనే. అంటే రాగపు వరసలు శ్రోతకి పరిచిత పూర్వాలుగా ఉంటేనే రసానందం కలుగుతోంది, లేకపోతే లేదు. తాళం విషయంలో ఈ స్థితి లేదు. అందుచేత ప్రపంచంలో ఏ దేశానికి చెందిన తాళ వాద్య కళాకారుడు సృష్టించినా లయ అనేది మనల్ని ఊపేస్తుంది. కాబట్టి శ్రవణాభ్యాస అవసరం రాగానికే పరిమితం.

అయితే ఒకటి, శాస్త్రీయ సంగీతంలో తాళం క్లిష్టంగా ఉంటుంది. లయ విన్యాసాలు సూక్ష్మంగా ఉంటాయి. లలిత సంగీతంలో ఈ లయ స్థూలంగా, సరళంగా ఉండి తొందరగా ఆకర్షిస్తుంది. ఈ ఆకర్షణకి కారణం ఏమిటంటే లలిత గీతాల లయ Patterns శ్రోత expectationsకి లొంగుతాయి.

శాస్త్రీయ సంగీతంలో కేవల సంగీతం ఎక్కువ. కేవల సంగీతం అంటే సాహిత్యాన్ని వదిలిపెట్టి సాగే సంగీతం. రాగాలాపన, స్వర కల్పనతో ఈ విషయాన్ని రుజువు చేస్తాయి. శాస్త్రీయ సంగీతంలో ప్రాధాన్యం సంగీతానికే మరి. సాహిత్యం ఆలంబనం మాత్రమే. అది పక్షికి స్తంభం లాంటిది. స్తంభం మీద నుంచి బయలుదేరి పక్షి ఎటెటో ఎగిరి మళ్ళీ స్తంభం మీద ఆగుతుంది. లలిత సంగీతంలో సాహిత్యం మనిషికి కాలిబాట లాంటిది. ఏ నృత్యాలు చేసినా, ఎన్ని ఎగురుళ్ళు ఎగిరినా, ఏ పరుగులు తీసినా మనిషి కాలిబాటను వదిలిపోవడం కుదరదు.

లలిత సంగీతం సాహిత్య భావాన్ని expose చెయ్యడానికి బలోపేతం చెయ్యడానికి ఉపయోగపడుతుంది.

శాస్త్రీయ సంగీతంలో సాహిత్యం రాగభావాన్ని expose చెయ్యడానికి పరికరంగా ఉంటుంది.

శాస్త్రీయ సంగీతానికి పాండిత్యమూ, లలిత సంగీతానికి రంజకత్వమూ ముఖ్యం అవుతున్నాయి. రాగ లక్షణాన్ని విడిచిపెట్టి స్వరాలను వాడుకుంటే అది శాస్త్రీయ సంగీతం అవదు. బేసూ ఏ రాగాన్ని ఎన్నుకున్నా మాధుర్యమే ప్రధానంగా సాగే లలిత సంగీతం అన్య స్వరాలను వాడేసుకుంటుంది. రాగ లక్షణాన్ని విస్మరించి స్వరవిన్యాసం చేస్తుంది.

అసందర్భం అయినా ఒక మాట ప్రస్తావించాలని ఉంది. శాస్త్రీయ సంగీతంలో పాండిత్యానికి ప్రాధాన్యం ఎక్కువ కావడంచేత కంఠంలో పెద్దగా శ్రావ్యత లేకపోయినా, స్వరకల్పనాదులు మాధుర్య రహితంగా ఉన్నా కొందరు సంగీత విద్వాంసులు గొప్ప గుర్తింపు పొంద గలిగారు. కర్ణాటక శాస్త్రీయ సంగీత ప్రపంచంలో పండితుడికీ కళాకారుడికీ తేడా లేకుండా పోయింది. గమనించారో లేదో అక్కడ ప్రచారంలో ఉన్న పదం ఒకటే - సంగీత విద్వాంసుడు - అన్నది. సాహిత్యంలో Scholarship వేరు Art వేరు. ఈ స్థితిని సంగీతం ఏర్పాటు చేసుకోవాల్సి ఉంది. అప్పుడు శాస్త్రీయ సంగీతం మరింత కళాత్మకంగా (గొట్టు పాండిత్యం వదుల్చుకుని) తయారౌతుంది.

మళ్ళీ శాస్త్రీయ లలిత సంగీతాల భేదానికి వస్తే శాస్త్రీయ సంగీతంలో గమకాలూ, సంగతులూ ఎక్కువ. లలిత సంగీతంలో అవి తక్కువ. సంగతులయితే అరుదుగా మాత్రమే తటస్థ పడతాయి. చాలా శాస్త్రీయ సంగీతపు కీర్తనల్లో పల్లవి కనీసం మూడు రకాల విన్యాసాలతో సాగుతుంది.

మన శరీరంలో ఉన్న ఏ ఘటకాల (components) వల్లనో కాని మనమంతా సంగీతానికి లోబడి పోయి ఉంటాం. ఒక బీట్ వింటున్నప్పుడు దానికి అనుగుణంగా, అప్రయత్నంగా, మనం కాలో, చెయ్యో కదుపుతాం. అలాగే ఎంత ప్రయత్నించి కూడా వినబోతున్న బీట్‌కి భిన్నమైన లయలో కదలికలు చెయ్యడంలో విఫలులమౌతాం. మనిషికీ సంగీతానికీ ఒక సహజమైన లంకె ఉందన్నమాట.

ఈ లంకె అత్యంత సహజ, సరళ స్థితిలో ఉంటుంది. జానపద సంగీతంలో లలిత సంగీతం దగ్గర కొచ్చేసరికి కొంత క్లిష్టత ప్రవేశిస్తుంది. సహజాతం (Instinct) స్థాయిలో జానపద సంగీతమూ, Highest skill స్థాయిలో శాస్త్రీయ సంగీతమూ ఉంటే ఈ రెండింటికీ నడుమ (జానపద సంగీతానికి కొంత దగ్గరగా) ఉంటుంది లలిత సంగీతం. (ఇక్కడ సహజాతం, నైపుణ్యం అనే పదాల గురించి ఒక మాట చెప్పాలి. ఈత, కుక్క విషయంలో సహజాతం. కుక్కని నీళ్ళలో పడేస్తే అది ఈదుకుంటూ గట్టుకు వచ్చేస్తుంది. అది ఈత నేర్చుకోనక్కర్లేదు. అదే ఈత, మనిషి విషయంలో నైపుణ్యం అవుతోంది. అతను దాన్ని నేర్చుకోవాలి. నేర్చుకున్నాక కుక్కకి తెలియని విన్యాసాలు అనేకం ఈతలో ప్రదర్శించగలడు)

జానపద సంగీతం, లలిత సంగీతం, శాస్త్రీయ సంగీతం ఈ మూడింటిలో ఒక దానికన్న మరొక దానికి - ప్రదర్శన కారుడికీ స్వీకరించే వ్యక్తికీ కూడా శిక్షణ ఎక్కువ అవసరం అవుతోంది. కనక చివరి రెండూ అసహజాలని, ఆఖరుదైన శాస్త్రీయ సంగీతం మరింత అప్రాకృతికం అనీ అంటే సంగీతజ్ఞులేమంటారో?!

# జలచక్రంతో మనిషి

- సి.వి. సర్వేశ్వరశర్మ

మనం నివసిస్తున్న ఈ గ్రహాన్ని భూగోళం అంటారు. నిజానికి ఈ గ్రహం ఉపరితలం మీద మూడింట రెండువంతులు నీరు ఉంది. ఈ జల గోళంతో మనిషి జీవితం రకరకాలుగా ముడిపడి ఉంది. మనిషి మనుగడ ఈ జలగోళంలో ఎలా కొనసాగుతున్నదో పరిశీలిద్దాం.

తల్లి గర్భంలో ద్రవ పదార్థాల మధ్య జీవం పోసుకున్నప్పటికిని మనిషి నీటిలో బ్రతుకలేడు. లోతు ఎక్కువగా ఉన్న నీటిలో తల నీటి ఉపరితలంపై ఉంచి నీటిలో మనిషి ఉండాలంటే నిర్విరామంగా కండరబలం ఉపయోగించి ఈదాలి. నీటిలో మనిషి ముక్కు, నోరు మునగనంత వరకూ ఎటువంటి ప్రమాదము సంభవించదు.

మనిషి శరీర సాంద్రత నీటి సాంద్రత కన్నా ఎక్కువ. శరీరం బరువులో 80 శాతం బరువును నీరు భరిస్తుంది. మిగిలిన 20 శాతం బరువు శరీరాన్ని నీటిలో తేల్చడమా? లేక ముంచడమా? నిర్ణయిస్తుంది. శరీరంలో అతి తేలికైనది కొవ్వు పదార్థము. నీటి సాంద్రతకన్నా దీని సాంద్రత తక్కువ. సామాన్య, మధ్య వయస్కుల్లో ఈ కొవ్వు శరీరం బరువులో 5 (అయిదు) శాతం ఉంటుంది. శరీరంలో అతి భారమైనవి ఎముకలు. వీటి సాంద్రత నీటి సాంద్రతకు రెట్టింపు ఉంటుంది.

పురుషుని ఎముకల బరువు దాదాపు 4700 గ్రాములు ఉంటుంది. మొత్తం శరీరం సగటు సాంద్రత నీటి సాంద్రత కన్నా ఎక్కువ ఉండడంవల్ల శరీరం నీటిలో మునిగిపోతుంది. స్త్రీలు, చిన్న పిల్లలు ఎక్కువ కొవ్వు పదార్థం కలిగి ఉంటారు. అందుకే వారు నీటిలో సులువుగా తేలేందుకు అవకాశం ఉంటుంది.

**నీట మునిగితే**

మనిషి నీట మునిగిన తరువాత ఆరు నుండి పదినిముషాల కాలవ్యవధిలో తప్పనిసరిగా ప్రాణాలు కోల్పోతాడు. ఆ సమయం దాటిన తరువాత నీట మునిగిన వ్యక్తిని బయటకు తీసినప్పటికీ శారీరకంగా జరుగుమార్పుల కారణంగా సజీవంగా ఉన్నట్లు కన్పించినా మరణించడం తప్పదు.

ఫిట్స్ వచ్చే వ్యక్తి ఫిట్ వచ్చి నీట పడి మునిగినా, గట్టి దెబ్బతగిలి స్పృహ కోల్పోయి నీట మునిగినా, ఈదుతూ ఉండగా గుండె పోటు వచ్చినీట మునిగినా మరణం తప్పదు. అటువంటి వారిని ఎంత వేగంగా నీటి నుండి బయటకు తీసి రక్షించినా ప్రాణాపాయ స్థితి నుండి కాపాడడం కష్టం. శీతల దేశాల్లో మరొక విశేషం తటస్థపడుతూ ఉంటుంది. నీటిలో పూర్తిగా మునగకపోయినప్పటికిని అతి చల్లని నీటిలో మనిషి అకస్మాత్తుగా పడేసరికి హఠాత్తుగా మరణిస్తాడు.

---

సి.వి. సర్వేశ్వరశర్మ, ప్రెసిడెంట్, కోనసీమ సైన్సు పరిషత్, కృష్ణమూర్తి స్ట్రీట్, అమలాపురం-533 201

దీనికి ముఖ్యకారణం గుండె ఆగిపోవడం. గుండె ఈ విధంగా ఆగిపోవడానికి వైద్యులు కారణాలు చెపుతున్నారు.

హృదయ ధమనులకు ఉండే చిన్న బొడిపెల వంటి అమరిక పీడన భేదానికి చాలా సున్నితత్త్వం కలిగిఉంటుంది. మెదడులో ఉండే వేగస్ నరం ద్వారా మెదడుకు, గుండెకు నిదానమైన రక్తపోటు ఉండేవిధంగా చెయ్యాలని వర్తమానం పంపుతుంది. ఈ బొడిపెలు ఎక్కువగా ఉత్తేజితం కాబడ్డాయంటే అవి అమిత వేగంతో పంపే వర్తమానాలను తట్టుకోలేక గుండె ఆగిపోతుంది.

**నీటి మీద తేలడం**

ఈత నేర్చిన మనిషి అనుభవం మీద ఈదుతూ నీటి ఉపరితలం మీద తేలుతూ ఈదవచ్చు. కాని ఈతతో సంబంధంలేని మనిషి కూడా నీటి మీద తేలగలడు. ఈతలో మనిషి చురుగ్గా నీటిని దూరంగా చేతులతో తోసివేయడం వల్ల ప్రతిబలాలు ఏర్పడి ఈతగాని శరీరం నీటిలో మునగకుండా కాపాడతాయి. నీటి మీద మనిషి తేలడం అంటే ఆ మనిషి శరీరభాగాలన్నీ ఏవిధమైన పనిచెయ్యకుండా నిశ్చలంగా ఉంటాయి. ఈ విధమైన స్థితి కొంతమందికి ఏర్పడుతుంది.

నీటి సాంద్రత కన్నా ఎక్కువ సాంద్రతగల వస్తువులు నీటిలో మునుగుతాయి. తక్కువ సాంద్రత గల వస్తువులు నీటిలో తేలుతాయి. నీటి సాంద్రత ఒకటి. మనిషి సాంద్రత 0.9 నుండి 1.05 వరకూ మారుతూ ఉంటుంది. ఈ మార్పు మనిషి శరీరంలోని కొవ్వు పదార్థాలు, ఊపిరితిత్తులలోని గాలి పరిమాణం కారణంగా వస్తూ ఉంటుంది. పరిస్థితిని బట్టి శరీరంలో ఉండే కొవ్వు పరిమాణం మారదు. అంటే మనిషి పీల్చిన గాలిని బట్టి ఆమనిషి శరీరసాంద్రత మారుతుంది.

ఊపిరితిత్తులలో గాలి ఉండడం వల్ల శరీరాన్ని తేలిక చేస్తుంది. అంటే గాలి పీల్చుకున్నప్పుడు శరీర సాంద్రత తగ్గడం పీల్చిన గాలి వదలి వేసినపుడు శరీరం సాంద్రత పెరగడం జరుగుతుంది. ఆరోగ్యంగా ఉండే యువకుడు నాలుగున్నర లీటర్ల గాలిని పీల్చుకోగలుగుతాడు. ఈగాలి కారణంగా అరవై కిలోగ్రాముల బరువుగల మనిషి సాంద్రత 1.05 నుండి 0.974కు తగ్గిపోతుంది.

మంచినీటిలో పడిన మనిషి సాంద్రత 0.9875 కంటే తక్కువ అయితే ఆ నీటిలో తేలడం వీలవుతుంది. అందుకే కొంతమంది మనుషులు ఎక్కువగా గాలిని పీల్చుకుని వారి శరీర సాంద్రతను పైన చెప్పిన విలువ కన్నా తగ్గించుకుని నీటిలో మునగకుండా తేలుతూ ఉంటారు.

**మంచి నీరు - సముద్ర జలం**

అయితే ఈ స్థితి నిముషకాలం దాటి ఉండదు. ఎందుకంటే ఊపిరి బిగపట్టి ఎక్కువ కాలం ఉండలేరు. అందుకే ఈ స్థితిలో కొద్దికొద్దిగా గాలి పీల్చుకుంటూ ఆ కొద్ది గాలిని వదలుతూ

ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ( ఊపిరి తిత్తులలోని గాలి పరిమాణం తగ్గకుండా) కొనసాగిస్తూ నీటి మీద తేలుతూ ఉంటారు. అనుభవం వల్లకాని ఇటువంటి పనిని సాధించలేరు.

మంచినీటిలోకన్నా సముద్ర జలాల్లో మనిషి తేలడం సులభతరం. ఎందుకంటే సముద్రజలాల సాంద్రత ఒకటి కంటే ఎక్కువ ఉంటుంది. చేతులు కట్టుకుని తలక్రింద పెట్టుకుంటూ కాళ్లు రెండూ ముడుచుకుని వెల్లకిల్లా నీటిలో పడుకుంటే శరీరంలో ఎక్కువ భాగం నీటితో స్పర్శకల్గి ఉన్నది కారణంగా మనిషి నీటిలో తేలే అవకాశం అధికం చేస్తుంది.

ఊపిరితిత్తులలోకి గాలి అధికంగా పీల్చడం వల్ల మనిషి నీటిలో తేలడం సాధ్యమవుతుందని అనుకున్నప్పటికిని పురుషుల్లో పదహారు శాతం, బాలురలో ఏడు శాతం వారి శరీర నిర్మాణం కారణంగా నీటిలో తేలడం సాధ్యం కాదు. బహుశా వారి శరీరంలో ఎముకలు భారవంతంగాను కొవ్వు తక్కువగాను ఉండడం ముఖ్య కారణం కావచ్చు. ప్రవహించే నీటిలో ఈ విధంగా నీటిలో తేలడం సాధ్యం కాదు.

**మనిషి శరీరం -**

మనిషి శరీరంలో నీళ్లు అతిముఖ్యమయినవి. ఎందుకంటే శరీరం బరువులో దాదాపు 80 శాతం బరువు నీటిదే. శరీరంలోకి నీరు మనం తినే ఆహార పదార్థాలు, సేవించే ద్రవపదార్థాల ద్వారా జేరుతుంది. సాధారణంగా శరీరం ఎంతనీరు గ్రహిస్తుందో అంతనీటిని విసర్జిస్తుంది. రోజులో శరీరం గ్రహించే ఇరవై ఆరువందల మిల్లీలీటర్ల నీటిలో సుమారు పదిహేను వందల మిల్లీలీటర్ల నీరునీరుడుగా విసర్జితమవుతుంది. చెమట రూపంలోను, పీల్చిన గాలి వదిలేటప్పుడు ఆవిరి రూపంలోను మరొక వెయ్యి మిల్లీలీటర్ల నీరు శరీరం నుండి బయటకు వెళ్లి పోతుంది. మిగిలిన వంద మిల్లీలీటర్ల నీరు మలంతో బాటు వెళ్లిపోతుంది.

ప్రాంతాన్ని బట్టి మనిషి సేవించే నీటి పరిమాణం మారుతూ ఉంటుంది. ఉష్ణదేశపు ప్రాంతాల్లో ఎక్కువగా నీరు తీసుకుంటాడు. ఈ ప్రాంతంలో మనిషి కొన్ని లీటర్ల నీటిని చెమట రూపంలో విసర్జిస్తాడు. శరీరంలో నీటికి సమతౌల్యం ఉండాలి. ఈ రకమైన సౌకర్యం కలుగజేయడానికి శరీరంలో మూత్రపిండాలు ఎంతో ఉపయోగపడతాయి.

శరీరం మీద చన్నీరు పోస్తే చెమట గ్రంథులు మూసుకుపోతాయి. వేడి నీరు పోస్తే స్వేదగ్రంథులు విశాలంగా తయారయి ఎక్కువగా నీరు చెమట రూపంలో విసర్జితం అవుతుంది. నీరుతాగితే అన్నవాహిక అంటే ఆహారపదార్థాలు వెళ్లే గొట్టం సులువుగా నీటిని పీల్చుకుంటుంది. కాని జీర్ణాశయానికి గల పలుచని పొర నీటిని అంతసులువుగా చొచ్చుకుని పోనీయదు. చిన్న ప్రేవుల్లో భాగమయిన డుయోడినమ్‌లోకి పోయిన నీటిని వేగంగా చిన్న ప్రేవులు పీల్చుకుంటాయి. మిగిలిన నీటిని పెద్ద ప్రేవు పీల్చుకుంటుంది.

**ఎక్కువ నీరు తాగితే**

ఎక్కువగా నీరు త్రాగితే ఏమవుతుందో చర్చించే ముందు వాంతి అవుతుందనే నిత్యానుభవ విషయాన్ని గుర్తు చేసుకుందాం. వేడి నీరు మెల్లిమెల్లిగా సేవిస్తే వాంతిని నిరోధించి జీర్ణరసం మందగించేటట్లు చేస్తుంది.

మరొక విశేషం కూడా చెప్పుకోవలసి ఉంది. హిస్టీరియా వ్యాధిగల వారు వ్యాధి వల్ల తెలివి తప్పినపుడు వారి ముఖం మీద నీళ్లు జల్లితే వారు తెలివిలోకి వస్తారు. అదేవిధంగా మంచుముక్కలు చప్పరించడంవల్ల దాహం, వాంతులు తగ్గుతాయి. అంతే కాదు ఈ మంచు మూత్ర నాళంలో వచ్చే ఇన్ఫెక్షన్ తీవ్రతను కూడా తగ్గిస్తుంది. భోజన సమయంలో మధ్య మధ్య కొంచెం అధికంగా నీరు సేవిస్తే గాల్ స్టోన్స్ ఏర్పడకుండా కాపాడుతుంది.

**మత్తు వస్తుంది**

ఎక్కువగా నీరు సేవిస్తే ప్రయోజనం ఉందనే భ్రమతో మరీ ఎక్కువగా నీరు త్రాగితే ఏమవుతుంది? మనిషికి మత్తు వస్తుంది. తలనొప్పి, మగత, మానసికంగా గాబరా, శక్తి హీనత, నడవ లేని తనం వస్తుంది. ఇంకా అధికంగా నీరు తాగితే శరీరం వణకడం, వంకర్లు పోవడం, కోమాస్థితికి వెళ్లడం చివరకు మనిషి మరణించే స్థితికి దారి తీయడం జరుగుతుంది.

నీరు తాగగానే అన్నవాహిక గుండా వెడుతుంది. అన్నవాహిక సులువుగా నీటిని పీల్చుకుంటుంది. నిముషాల్లో ఈనీరు రక్తాన్ని జేరుతుంది. అందువల్ల రక్తం ఘన పరిమాణం పెరుగుతుంది. రక్తం విలీనం కాబడి హైపోటానిక్‌గా మారుతుంది. అంటే ఉండాల్సిన పీడనంలో ఈ ద్రవం ఉండదన్న మాట. ఈ రక్తం ప్రసరణం అవుతూ శరీరంలో జలతుల్యతను కాపాడే మెదడు భాగాన్ని జేరి దాని పనికి ఆటంకం కలుగ జేస్తుంది.

మెదడు దిగువ భాగంలో గల హైపోతెల్మస్‌లో ఉండే ఆ స్మారెసిప్టార్లు చురుకు తనానికి వస్తాయి. ఫలితంగా పిట్యూటరీ గ్రంధి విడుదలచేసే యాంటీ డైయురేటిక్ హార్మోను పరిమాణాన్ని తగ్గించే టట్లు చేయడం గాని లేదా ఆ హార్మోను విడుదల కాకుండా ఉండేటట్లు చేయడం గాని జరుగుతుంది.

సామాన్యంగా ఈ హార్మోను మూత్రపిండాలు నీరు గ్రహించే ప్రక్రియను ప్రోత్సహిస్తుంది. అందువల్ల తక్కువ పరిమాణంలో నీరుడు తయారవుతుంది. ఈ హార్మోను విడుదల తగ్గి పోవడం వల్ల అధికంగా నీరుడు ఉత్పత్తి కావడం, శరీరం నుండి అధికంగా నీరు విసర్జితం కావడం మొదలవుతుంది.

**ఆరోగ్యవంతుడైన యువకుడు**

ఆరోగ్యవంతుడైన యువకునికి దాహం లేనప్పుడు, నీరు తాగాలనిపించనపుడు బలవంతంగా ఒకేసారి పదిహేనువందల మిల్లీలీటర్ల కుళాయి నీటిని తాగమని ఇస్తే ఎక్కువగా ఆయువకుడు

నీరుడు విసర్జిస్తాడు. సేవించిన నీటిలో డెబ్బయి అయిదు శాతంనీటిని నీరుడుగా కేవలం రెండు గంటల కాల వ్యవధిలో విసర్జిస్తాడు. నాలుగు గంటల కాలవ్యవధిలో తొంభయి శాతం నీటిని ఆవిధంగా విసర్జిస్తాడు. కణజాలం యొక్క స్వభావానికి ఏ విధమైన హానీ కలుగదు.

కాని ఎక్కువ పరిమాణం గల నీటిని తిరిగి తిరిగి సేవించడం మొదలు పెడితే ఈ నీటిని మూత్రపిండాలు విసర్జించే ప్రక్రియను సులువుగా నిర్వహించలేవు. వాటికి అంత ఎక్కువ సామర్థ్యం ఉండదు. నీరుడు తయారు చేయగల వాటి సామర్థ్యం పరిమితంగా ఉంటుంది. అవి నిముషానికి పదహారు మిల్లీలీటర్ల నీరుడును విసర్జించగలవు. అంటే అవి విసర్జించగల పరిమాణం కంటే ఎక్కువ పరిమాణం నీటిని శరీరం తీసుకుంది.

దీనివల్ల శరీరంలోని జలతుల్యత ధనాత్మకంగా మారుతుంది. రక్తం బాగా విలీనం కావడం వల్ల అందులోని సోడియం గాఢత బాగా తగ్గిపోతుంది. అనేక కణజాలాలు నీటిని పీల్చుకుని బాగా ఉబ్బిపోతాయి. మెదడులోని కణాలు, రక్తనాళాల చుట్టూ ఉండే కణజాలం ఉబ్బడం వల్ల మనిషికి మత్తు మొదలవుతుంది. అందుకే మితిమీరి మంచి నీళ్లు తాగకూడదు.

**దాహం - మంచినీళ్లు**

దాహం వేస్తే మంచినీళ్లు తాగుతాము. మంచినీళ్లు దాహాన్ని వెంటనే ఎలా తీర్చగలవో మనకింకా తెలియదు. మనకున్న విజ్ఞానం ఏకారణాల వల్ల దాహం వేస్తుందో మాత్రం చెప్పగలదు. నీరు శరీరంలో ప్రధాన కణ ప్రవాహి మరియు అంతర కణ ప్రవాహాలలో ఉంటుంది. ఈ రెండు ప్రవాహిలయందు సోడియం అయానులు, పోటాషియం అయానులు సమృద్ధిగా ఉంటాయి.

ఈ రెండు ప్రవాహిలు కణకవచంతో వేరు చేయబడి ఉంటాయి. ఈ కణకవచం గుండా లోపలకు, వెలుపలకు నీరు స్వేచ్ఛగా వ్యాపనం చెంద గల్గుతుంది. అయానులు మాత్రం వెళ్లలేవు. శరీరం నష్టపోతున్న నీటిని తగిన సమయంలో భర్తీ చేయక పోతే 'డీహైడ్రేషన్' (జలవియోగము) ఏర్పడుతుంది. ఈ సందర్భంలో శరీరంలో ప్రవాహినందలి ద్రావితము గాఢత అధికమయి రెండు ప్రవాహిల ఘన పరిమాణం తగ్గిపోతుంది. అందువలన మనిషికి దాహం వేస్తుంది. మంచి నీళ్లు తాగడం కోసం ప్రయత్నిస్తాడు. మంచినీళ్లు దొరికే కాలవ్యవధిలో మెదడులోని హైపోతేలమస్‌లోని పిట్యూటరీ గ్రంథి, యాంటీ డైయురేటిక్ హార్మోనును, వాసో ప్రెసీనును విడుదల చేస్తుంది.

ఈ వాసోప్రెసీను హార్మోను, మూత్రి పిండాలు గరిష్ఠ ప్రమాణంలో నీటిని గ్రహించే విధంగా ప్రేరణ చేస్తుంది. శరీరంలో నీరు అధికంగా ఉన్నప్పుడు ఈ వాసోప్రెసీన్ హార్మోను మూత్ర పిండాలు గరిష్ఠ ప్రమాణంలో నీటిని విడుదల చేసేటట్లు ప్రేరణ చేస్తుంది. హైపోతెలమస్‌లో ఉండే ఆస్మోరెసెప్టారు కణాల ప్రమేయం దాహం అదుపు చేయడంలో ఉన్నట్లు ప్రయోగాలు సమర్థిస్తున్నాయి.

# పత్రిక, ప్రసార మాధ్యమాల్లో తెలుగు

- నాగసూరి వేణుగోపాల్

తెలుగు భాష దుస్థితి గురించి చర్చించుకునే సందర్భంలో - ''ఏంటండి పత్రికలు వాడే భాష? ఆ భాషకు ఏమైనా స్థాయి వుందాండి? ఇక టీవీ చానళ్ళ భాష గురించి చెప్పుకోక పోవడం ఉత్తమం..'' లాంటి మాటలు వినబడుతూ వుంటాయి. ఈ మాధ్యమాలలో వాడే భాష మహా గొప్పగా వుందనీ, లోపరహితమనీ - ఎవరూ అనడం లేదు. కానీ ఒక్క విషయం ఆలోచించండి - ఇంట్లో అమ్మా, నాన్నలు - కాదు మమ్మి డాడీలు - స్టయిలీగా వుండాలనో, ఇంగ్లీషు బాగా రావాలనో పిల్లలతో ఇంగ్లీషు మాట్లాడుతారు. ఇక వారి మిత్రులు - అదేనండి ఫ్రెండ్స్ - హాయ్, హలో, బై అంటారుగానీ - తెలుగు ముక్క పలుకరు. ఇక వారికి తెలుగు ముక్క ఎక్కడయినా కనబడుతుందా, వినబడుతుందా? - అంటే ముక్కలయినా, చెక్కలయినా తెలుగు కనబడేది, వినబడేది పత్రికలలోనూ, ప్రసార మాధ్యమాలలోనే! మీరు కొంచెం పరిశీలిస్తే యువతరానికే కాదు. అసలు తరానికి కూడా ఎక్కువ తెలుగు ( ? ) తారసపడేది మాధ్యమాలలోనే!

ఇటీవల శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం భౌతిక శాస్త్ర ఆచార్యులు డా. వి. సుందరరాజ గారితో మాట్లాడుతున్నపుడు ఆయనో మాట అన్నారు. ''ఇప్పుడు యూనివర్సిటికి వస్తున్న విద్యార్థుల స్థాయి మరీ నాసి రకంగా వుంద'' ని, మరో అధ్యాపకుడు చెబుతూంటే - డా. సుందరరాజ ''మనం అధ్వాన్నపు స్థాయి విద్యార్థులను తయారు చేసి బయటికి పంపాం. వారు ఉపధ్యాయులుగా మారి, మరింత అధ్వాన్నపు విద్యార్థులను మనకు పంపుతున్నారు'' అని వ్యాఖ్యానించారు. ఇది చాలా అర్థవంతమైన పరిశీలన. ఎంతసేపు విద్యార్థుల స్థాయి అంటామేగాని, మన పాత్ర అందులో వుండదా? అలాగే నేడు పత్రికా, ప్రసార మాధ్యమాలలో తెలుగు యిలా అఘోరించడం కూడా కర్ణుడి చావు లాగా - పలురకాల కారణాలతో యిలా తగులడుతోంది! ఇంత వరకు దీని గురించి పట్టించుకోవడం ఫ్యాషన్ కాదని భావించడం కూడా జరిగింది. అయితే కనీసం యిపుడైనా దీని మీద దృష్టి సారించడం చాలా ఆరోగ్యకరం, ఆనందకరం. ఈ చైతన్యం క్రమంగా పెరుగుతూ, విస్తృతమవుతోంది. పొరుగు రాష్ట్రాల్లో ఏం జరుగుతోందని ఆలోచన కలుగుతోంది. సమస్యను సరిగా అర్థం చేసుకోవడంలో సఫలీకృతమైతే, సగం సమస్య తీరినట్టే! ఇక్కడ కూడా అంతే! చికిత్స, నివారణకంటే ముందు ఎలా కొంప క్రమంగా మునిగిందో చూద్దాం.

దాదాపు రెండు దశాబ్దాల క్రితం ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక సంపాదకులు శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ గారు ఒక యూనివర్శిటి ( ఆంధ్ర విశ్వ విద్యాలయం? ) లో మాట్లాడుతూ - పత్రికల్లో ప్రమాణాలు పడిపోవడానికి విశ్వ విద్యాలయాల స్థాయి పడి పోవడం కారణం అని అన్నారు. అయితే యిది అంత సరళమైన కారణంతో ముడిపడ లేదు. సమాజంలోని ప్రతి పార్శ్వం అంతో యింతో కృషి చేస్తోంది. అది నేడు మరింత జటిలమై పోయింది గానీ, సరళం గాలేదు. నిజానికి ఈ విషయం గురించి పరిశీలించాలంటే పత్రికారంగంలో వచ్చిన ప్రధాన పరిణామం గుర్తించాలి. రెండు తరాల క్రితం పత్రిక నడపడం ఒక ఆశయం, ఒక సేవ, ఒక భవిష్యత్ దృష్టి! కానీ యిది క్రమంగా పత్రిక ఒక పారిశ్రామిక ఉత్పత్తి, పత్రిక నిర్వహించడం కోట్ల రూపాయల వాణిజ్యం. వాణిజ్యం అంటే

---

నాగసూరి వేణుగోపాల్, ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, ఆకాశవాణి, అనంతపురం

ఉత్పత్తులు పరిమాణంలో పెరగాలి, లాభార్జన పరిమాణం పెరగాలి - అదీమార్పు. దాంతో సంపాదకుడే అప్రధానమై, మేనేజర్ ప్రముఖుడైనాడు. ఏ పద్ధతి ఎక్కువ ప్రకటనలు ఆకర్షిస్తుంటే, ఆరకం వార్తలు, రంగుల ఫోటోలు అధికమై పోయాయి. ఈ విద్యలో రాణించేవారు అవసరం కానీ - భాష తెలిసిన వారు, రచనా సామర్థ్యం కల్గినవారు ఎందుకు? అంతకు మించి మంచి సామర్థ్యాలు, అభిరుచి కలిగిన వారు ఈ రంగానికి గత పాతికేళ్ళుగా రావడం బాగా తగ్గింది. ఈ మార్పును మాతరం కళ్ళార చూసింది. దీనికి కారణం ఉద్యోగంలో చాలా అభద్రత, పత్రికా యాజమాన్యాలలో యితర అవసరాలు, అంతకుమించి పత్రికలు ప్రచారవేదికలుగా మారడం! అందువల్ల ఉన్నవారితో సర్దుకోవడం కానీ, మంచి పాత్రికేయులను తయారు చేసుకోవాలనే దృష్టి పత్రికా యాజమాన్యాలకు లేదు. ఇక్కడ ఒక విషయం గమనించాలి - ఈ పోటీవల్ల జీతాలు పెరిగాయి, మహా బాగా పెరిగాయి అని అంటారు. ఈ పెరగడం అనేది వినోద్‌మెహతా ('అవుట్‌లుక్' వారపత్రిక సంపాదకుడు), శేఖర్‌గుప్తా ('ఎక్స్‌ప్రెస్' ఎడిటర్), ఎమ్. జె. అక్బర్ (ఏసియన్ ఏజ్, డెక్కన్ క్రానికల్ సంపాదకుడు) వంటి పెద్ద పాత్రికేయుల విషయంలో కానీ - అందరూ చదివే వార్తలు రాసే గ్రామీణ విలేఖరులూ, వారి నడకలను తీర్చే బ్యూరో వారుకానీ, సంపాదక వర్గంలో పనిచేసే వారుగానీ కాదు. వారి జీతాలు చాలా అధ్వాన్నంగా వున్నాయి. వారి బతుకు నిత్య సంకటంగా వుంది.

జీతంతో సంబంధం లేకుండా కొంతమంది చిత్తశుద్ధితో చేస్తారని భావించినా, ఆధునిక టెక్నాలజి మరో రకంగా గుదిబండ అయ్యింది. ఇపుడు కంపోజర్లు, ప్రూఫ్ రీడర్లు అదృశ్యమయి పోయారు. రాసే వాడు నేడు కంప్యూటర్ తెరమీద రాయాలి. అదికూడా ఊరూరా ఎడిషన్లు రావడంతో తాజా వార్తలు యివ్వాలనే ఆశయం అర్ధరాత్రి దాటినా పత్రికలు తయారవుతూనే వుంటాయి. బాగా చేస్తే భుజం తట్టడం వుండదు గానీ, పొరపాటు జరిగితే పాతరవేసే విధానం వుంది, కనుక సదా ఉద్రిక్తతతో మనిషి వుంటాడు. దాంతో సృజనకు చిరునామా ఎక్కడ? వాడు మంచి పుస్తకాలు చదివితే శైలి అలవడుతుంది, సామెతలు, పలుకుబళ్ళు, నానుడులు గుర్తువుంటాయి, మరింత అర్థవంతమైన సమానార్థకాలు గుర్తుకు వస్తాయి. వీరి చదువు వారు కీబోర్డు మీద రాసిందే చదువుకో లేక పోతున్నారు. ఇక చిన్నయ సూరి పంచతంత్రం చదువుతారా? ఫలితంగా భాష అంటే ఏమిటి; ఎలా వుండాలి, ఎందుకు రాయాలి, భవిష్యత్తరాలపై ఈ ప్రభావం ఎలా వుంటుంది? - అని పాత్రికేయులు ఆలోచించే అవకాశం లేదు. పదవ తరగతి పూర్తి కానివాడు కూడా మండల కేంద్రం కంటే చిన్నవూర్లో వార్తలు పంపుతాడు. వీరి గురించి మనం ఏం చెప్పాలి? అందువల్ల యిపుడు జరిగిన పరిణామాల వల్ల కలిగిన అనర్థాలను గుర్తించి, అర్థం చేసుకుందాం. తర్వాత పాఠకులు, పండితులు, ఆలోచనా శీలురు ఈ పరిణామాలవల్ల కలుగుతున్న అనర్థాలను పత్రికల యాజమాన్యాలకూ, సంపాదకులకూ వివరించాలి. పత్రిక నిర్వహించడం కేవలం లాభసాటి వాణిజ్యం కాదు. దీర్ఘ స్థాయిలో తరాలను సృజించడం అని వారికి వివరించడం పండితుల, మేధావుల బాధ్యత. ఇది జరగక పోతే, ఈ రంగం మరింత దిగజారి పోయి మరింత ఘోరమైన గమ్యాలకు దారి తీయ వచ్చు. నిజానికి ఏ పత్రికలో పని చేసేవారు, ఆ పత్రికను సమగ్రంగా? ఆర్తితో అధ్యయనం చేస్తే ఎంతో ప్రయోజనం వుంటుంది. వారు ఆ మాత్రం కూడా పొందలేని అభాగ్యులు. దానికి తోడు పత్రికల్లో పని చేసేవారు కూడా ఎరలకు లోబడి, కష్టపడటం కన్నా, అడ్డదారుల్లో సాగడం ఎక్కువ లాభదాయకమైనదనే వారు కూడా ఎక్కువ అయ్యారు. ఇది ఒక పత్రికా రంగంలోనే కాదు, మొత్తం సమాజం రీతి.

పదేళ్ళ క్రితం పత్రికా రంగం మీద అంతగా పుస్తకాలుండేవి కావు. నేడు ఆసమస్య లేదు. చాలా మంది పత్రికా దిగ్గంతులు రాసిన పుస్తకాలు అందుబాటులో వున్నాయి. వాటిని అధ్యయనం జేసి భాష, వ్యక్తీకరణ వృద్ధి చేసుకోవచ్చు. అయితే వాటిని చదివే తీరికా, ఓపికా, ఆసక్తి వుండాలి అంతే! అది లేకపోవడంతోనే హడావిడిగా రాసేటపుడు అందమైన, అర్థవంతమైన పదం గుర్తుకు రాదు. దాంతో వింత అర్థం, విపరీత అర్థం సాధ్యమవుతుంది. వీటికి ఉదాహరణలు ఎవరికి వారు చెప్పగలరు.

సాధారణ వార్తల విషయం యిలా వుంటే, విజ్ఞాన శాస్త్రం, ఆర్థిక శాస్త్రం, వ్యవసాయం, వైద్యం వంటి విషయాల వ్యవహారం చెప్పనక్కర లేదు. గతంలో అనువాదాలు చూడండి- ఆమ్లజని, ఉదజని, నత్రజని, కర్బనం యిలా మంచి పదాలు తయారు చేసుకున్నాం. ఇపుడు అంత పాండిత్యం, దృష్టి, తీరిక లేవు. అలాగే ఆంగ్ల పదాలు తెలుగు లిపిలో వాడుతున్నాం. నార్ల వెంకటేశ్వర రావు గారు ఐక్యరాజ్య సమితి, నానా జాతి సమితి, త్రాప్వాడ వంటి పదాలు ఎన్నో సృష్టించారు. యుగకర్త వంటి పదబంధాలను ప్రాచుర్యంలోకి తెచ్చారు. ఇపుడు అటువంటి దృష్టి, కృషి లేదు. తెలుగు అకాడమి ప్రచురించిన పారిభాషిక పదకోశాలు చూడండి - జంతు శాస్త్రం, వైద్యం వంటి అంశాల మీద ఆంగ్ల పదానికి ఎదురుగా అదేపదం తెలుగు లిపిలో వుంటుంది. దీని వల్ల ప్రయోజనం ఏమిటి? దీనికి తెలుగు అకాడమిని తప్పుపట్టడం కాదు. ఈ ప్రత్యేక రంగాలలో పని చేసే నిపుణులకు భాష మీద పట్టుగానీ, తగిన దృష్టిగానీ - అంతకు మించి తెలుగు భాషను సుసంపన్నం చేయాలనే బాధ్యతగానీ వుండక పోవడంతో - ఇంటర్మీడియేట్ స్థాయిలో తెలుగులో పుస్తకాలు వెలువరించి మూడు దశాబ్దాలు అయినా నేడు దుస్థితి అలాగే వుంది. దీనిలో అందరి బాధ్యత వుంది. వారికి ఆయా బాధ్యతలు గుర్తు చేయాల్సిన బాధ్యత సమాజంపై వుంది. సమాజానికి కాపలా కాసే పత్రికా, ప్రసార మాధ్యమాలపై వుంది. కానీ వీటన్నిటికీ పరాకాష్టగా పత్రికల బాగోగులను చర్చించే వేదిక ప్రస్తుతం ఏదీ సరిగా లేదు. ఇది చాలా చాలా అవసరం.

తర్వాత ఊరూరా, మారుమూల గ్రామానా - పలుకును బడిగా సాగిన రేడియో - వ్యవహారిక భాషను హాయిగా అందించి ప్రచారంలోకి తెచ్చింది. పత్రికల్లో లాగానే యిక్కడ కూడా పాండిత్యంగల వారు, దార్శనికత గలవారు పనిచేయడం వల్ల పునాదులు బలంగా వున్నాయి. అయితే గత పాతిక సంవత్సరాల్లో సంభవించిన సామాజిక పరిణామాలకు యిదీ మినహాయింపు కాదు. ప్రజలకు అవసరమైనవి యివ్వడంలో ఆకర్షణ సహజంగానే వుండదు. అందుకే నేడు మహానగరాల్లో మొదలైన ప్రయివేటు రేడియోలు యింతవరకు నిషిద్ధమైన రీతులు యిపుడు వాడి ప్రాచుర్యంలోకి వస్తున్నారు. ఇది యిపుడిపుడే మొదలైన వ్యవహారం కనుక దీని గురించి రేపు ఆలోచిస్తాం.

ఇక తెలుగు ఉపగ్రహ చానళ్ల గురించి చెప్పుకోక పోతే నిండుదనం రాదు. శ్రీశ్రీ 'విషపుత్రిక' అని మరో సందర్భంలో అన్నాడు గానీ - నేడు ఈ సామాజిక దుష్పరిణామాల విషపుత్రిక నిర్వంధంగా తెలుగు టీవీ చానలే! అదో రంగుల మాయాలోకం. అక్కడ మేధతో పనిలేదు. అంతా శరీర భాషే! పత్రికల్లో పడిపోయిన ప్రమాణాల గురించి మాట్లాడుకున్నాం. అవీ, సినిమాల్లో పడిపోయిన విలువలు, వీటికి తోడు ప్రపంచీకరణలో భాగంగా వ్యాపారంలో వచ్చిన పెనుమార్పులు కలిసి టీవీ చానళ్ళను సృజిస్తున్నాయి. టెలివిజన్ పూర్తిగా దృశ్య మాధ్యమం. ఆలోచించగలగడం, వ్యక్తీకరించగల సామర్థ్యం, వాచకం - యివేవి అవసరం లేకుండా కెమెరాలో అందంగా వుంటే చాలు. అందుకే సభను చూపేటపుడు కెమెరావాడు అందమైన మొహం కోసం మొహం వాచి కెమెరా త్రిప్పుతాడు. కంటికి నదురుగా వున్న వ్యక్తే వార్తలు చదువుతుంది, కార్యక్రమాలకు లంగరు వేస్తుంది. రూపర్ట్ మార్డోక్ రాబోయే హిందీ, ఇంగ్లీషు

వార్తల చానళ్ళలో పనిచేసేవారు ఎలా అందంగా వుండాలో సింగారాలకు సంబంధించి ప్రత్యేక శిక్షణ నిస్తున్నారట. ఈ పోకడకు ప్రఖ్యాత పాత్రికేయుడు కులదీప్‌నయ్యర్ తీవ్రంగా వ్యతిరేకత ప్రకటిస్తున్నారు. ''జర్నలిజం మేధో సంబంధమైన వ్యవహారం - అది అందంగా కనిపించే వృత్తి కాదు'' అంటున్నారు. ఇది టెలివిజన్ పోకడకు ఒక నిలువెత్తు దర్పణం.

ఇపుడు వినియోగదారుడే రాజు, రారాజు. వారికి ఏది కావాలంటే అది, ఎలా కావాలంటే అలా! ఇదీ నడుస్తున్నతంతు. అంతో యింతో ఖాళీగావున్న పిల్లలు, యువత, గృహిణులను ఆకర్షించాలని రక రకాల ప్రయత్నాలు. పాతికేళ్ళలో కాన్వెంట్ల మీద, ఎమ్‌సెట్ల మీద మోజు మహాబాగా పెరిగింది. దానితో ఈ తరం పిల్లలు వాక్యంలో మూడు ఆంగ్ల పదాలు వాడటం లేదా మూడు ఆంగ్ల వాక్యాలకు ఒకటిన్నర తెలుగు వాక్యం వాడటం రివాజు. వీళ్ళని ఆకర్షించడానికి ఎరలుగా వాడే కార్యక్రమాలు, వాటిని నడిపే యాంకరమ్మలు, యాంకరయ్యల గురించి ఏం చెప్పాలి? కార్యక్రమాలకు పెట్టిన పేర్లలో ముప్పాతికవంతు ఇంగ్లీషు పేర్లేవుంటాయి. అంతెందుకు మనం ఎపిసోడ్ అంటాం - కానీ కన్నడంలో 'సంచికె' అంటారు. మనం తెలుగు పదాలు తయారు చేసుకోవడం కాదు, వున్న పదాలనే వాడకుండా వాటిని మరచి పోతున్నాం. పత్రికా రంగంలోలాగానే యిక్కడ కూడా అత్యంత ప్రతిభావంతులు రాలేకపోతున్నారు. ఉన్నవారు ఏదో ఆకర్షిస్తున్నారు. నిజానికి సినిమా, టెలివిజన్‌ల గురించి పెద్దలు పట్టించుకోవడం లేదు. అలా వాటి గురించి మాట్లాడటం చిన్నతనమని వారు భావిస్తున్నారు. దాంతో 'బుల్లి తెరీయులు' పేట్రేగిపోతున్నారు. కేవలం భాష మాత్రమే కాక ఆలోచనలు, సంసారాలు, సంస్కృతి - కలుషితమవుతున్నాయి. ప్రాణాలు పోతున్నాయి. అయితే నేడు కొందరు పెద్దలు యిపుడు దృష్టి సారిస్తున్నారు. ఇది చాలా మంచి పరిణామం. లేకపోతే తెలుగు కాక, ఇంగ్లీషు రాక - మరీ సంకర భాష తయారవుతోంది. ఈ పోకడ యిలాగే సాగితే తెలుగు పూర్తిగా అదృశ్యం కావచ్చు. ఇతర భాషలు - తమిళం, కన్నడం వంటి భాషల్లో ప్రయివేట్ చానళ్ళు ఆయా భాషల పురోగతికి ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. ఆయా భాషలు మాట్లాడేవారు ఎక్కడ వున్నా, గాలించి వారి గురించి యితరులకు చెబుతున్నారు. భాష కోసం ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు. ఇటువంటి ప్రయత్నం మన చానళ్ళలో, పత్రికల్లో అంతగా సాగడం లేదు.

సరే, చివరగా మనం ఏంచేయాలో ఒకసారి ఆలోచిద్దాం. పొరుగు రాష్ట్రాల్లో ఆయా భాషల రక్షణకు వారి పత్రికలు, రేడియో, టీవీలు ఏమీ చేశాయో, ఏమి చేస్తున్నాయో మనం తెలుసుకోవాలి. దాని వల్ల మనం ఏమి చేయడం లేదో మనకు తేట తెల్లం అవుతుంది.

అలాగే మనం ఏమి చేయగలమో బోధపడుతుంది. దీనికి ఆయా రాష్ట్రాల్లో జరుగుతున్న కృషిని మనం యిక్కడ ప్రచారం చేయాలి. ఆ విజయ పథాలను అనుసరించాలి. రెండవది యిపుడు భాషా చైతన్యం వెల్లివిరుస్తోంది కనుక పత్రికా, చానళ్ళ యాజమాన్యాలకు ఈ విషయం గురించి వివరించే ప్రయత్నం జరగాలి. ఇందులో వారిని భాగస్వాములుగా చేయాలి. ఈ రెండు ప్రయత్నాలకు దోహదపడే ప్రతి ప్రయత్నం ఖచ్చితంగా జరగడం మూడవది. తెలుగులో కూడా ''స్పెల్‌చెక్'' వంటిది రావాలి.

ఇదీ పత్రిక, ప్రసార మాధ్యమాలలో తెలుగు గురించి స్థూలమైన చిత్రం. దీని ఆధారంగా, మరిన్ని పరికరాలతో మరింత విశ్లేషణ, వివేచన జరగాలి. తరుణోపాయాలు సాధ్యపడాలి.

*(2003 ఫిబ్రవరి 15, 16న వరంగల్‌లో జరిగిన 'రాష్ట్రస్థాయి తెలుగు భాషోద్యమ సంఘం మహాసభలు'లో సమర్పించబడిన పత్రం యిది)*

# తెలంగాణ భాషలోతొలి కథా సంపుటి - 'కడుపుకోత'

- డా॥ బి.ఎన్. ఆచార్య

తెలుగు సాహిత్యంలో మాండలికాన్ని మొదట ప్రవేశపెట్టింది గురజాడ అప్పారావు గారు. అయినా తొలి సారిగా కథలు రాసినవారు మాధవ పెద్ది గోఖలే. అయన కృష్ణా గుంటూరు జన భాషను వాడుకుని కథ రాస్తే పండితులంతా వ్యతిరేకించారు. కథలోని పాత్రలు ప్రజల భాష మాట్లాడితే ఫరవాలేదు, కాని కథా రచయిత కూడా ప్రజలతో కలిసి, వారి భాషలో కథ చెప్పడాన్ని అప్పటి మేధావులు ఆక్షేపించారు.

తెలంగాణ మాండలికంలో కథా సంపుటాలు రావటం 1977లో 'కడుపు - కోత' తోనే మొదలయ్యింది. కడుపు కోత రచయిత శ్రీదేవరాజు మహారాజు. ఆయన మొదటి సంపుటం 'కడుపు కోత' కాదు అంతకు ముందే తెలంగాణ ప్రజల భాషలో కవిత్వం రాసి ''గుడిసె - గుండె'' పేరుతో (1974లో) ప్రకటించారు. మాండలికంలో కవిత, కథచెప్పి మెప్పించింది, మొదటిసారిగా సంపుటాలు ప్రకటించిందీ ఆయనే. ఆ తరువాత చాలా మంది రచయితలు ఆయనను అనుసరించారు.

ముందు తరం రచయితల్లో వట్టికోట అళ్వార్ స్వామి, గూడూరు సీతారాం, సురమౌళి, యశోదారెడ్డి మొదలైన వారు తెలంగాణ జీవితాన్ని ప్రతిబింబిస్తూ ఆ భాషలో కథలు రాశారు. ఈ తరం రచయితల్లో శ్రీయుతులు దేవరాజు మహారాజు, పడాల రాములు, అల్లం రాజయ్య, వుప్పల నరసింహం, కాలువ మల్లయ్య, బి.ఎస్. రాములు, రఘోత్తమ రెడ్డి మొదలైన వారు ఈ కోవలో చేరతారు.

'కడుపు కోత' కథా సంపుటిలో రెండు రకాల కథలున్నాయి. పూర్తిగా మాండలికంలో రాసినవి కొన్ని. కథ మామూలు వ్యవహారిక భాషలో నడిచి, సంభాషణలు మాత్రం మాండలికంలో ఉన్నవి కొన్ని. సంపుటిలోని మొదటి కథ కడుపు కోత ఈ విధంగా మొదలవుతుంది.

''కమలమ్మను దూవాఖాన్ల శెరీకు జేశింన్రు. దానికి కడుపు నొప్పి. ఇయ్యాల్లనా నిన్ననా ఎన్నొద్దుల్నించి అగోరిస్తాంది. మంత్రాలు తాయితలు ఎన్ని గట్టినా తక్వగాలె. ఎందరి వైద్యుల తాన మందు దిన్నా తక్వగాలె. ఆకాడికి అల్లుడు మంచోడు. నా బిడ్డ ఆగమ్మ పక్షోలె తల్లడిస్తుంటె కొంటవొయి ఉస్మానియల ఏ శిండు. పెద్ద డాక్టర్లు జూశి ఆపరేషను జెయ్యాలన్నారు'' - ఈ రకంగా కథంతా ఒక ముసలవ్వ అనుభవంలోంచి, ఆమె మాటల్లోనె సాగిపోతుంది. బిడ్డ ఆపరేషను గురించి మొదటి సారిగా హాస్పిటల్‌కు వచ్చిన ముసలవ్వ అక్కడి అన్యాయాల్ని అసహ్యించుకుంటుంది. ఆపరేషన్ థియేటర్ లోంచి బయట పడ్డ ఆమె కూతురు కమలమ్మ మెళ్లో పుస్తెలతాడు. మాయమవడం ఇందులోని ఇతి

ఈ కథలో ఇతి వృత్తం కంటె శైలి గొప్పది. రచయిత ఎక్కడా కనబడకుండానే ముసలమ్మ మాటల్లో సమాజ స్వరూపాన్ని చక్కగా కళ్లకు కట్టిస్తారు. ''నాదేమొ తెల్వని గోరమాయె. నాకే మెరుక?'' -

---

డా. బి. ఎన్. ఆచార్య, నాగార్జున విశ్వవిద్యాలయం (గుంటూరు) లో ప్రాజెక్ట్ ఆఫీసర్‌గా ఉన్నారు.

అన్న అమాయకపు మాట వెనక హాస్పిటల్‌లో పైస పైసకు పీడించే చెడ్డ సంప్రదాయాన్ని దుయ్యబడతారు. ఆగమ్మ పక్షి, అంగరంగ వైభవంగ పెండ్లి, బిడ్డ అంబ్యాదది, సర్కారి దవాఖాన, సాయబాను వంటి ఎన్నో మాటలు ఉపయోగించి ముసలవ్వ పాత్రకు జీవం పోశారు. ఇది చక్కటి జానపద వ్యక్తీకరణకు ఉదాహరణ.

వైద్య విధానం మీద నర్మగర్భంగా దెబ్బ తీసిన రచన ఇదొక్కటే కాదు. సంకలనంలోని మరికొన్ని కథలు కూడా ఆపని చేశాయి. కడుపు కోత కథ మహానగరంలోని ఆసుపత్రి వాతావరణం చిత్రిస్తే ''కండ్లు దెరిశిన నెత్తురు'' కథ తాలూకా స్థాయిలో ప్రయివేట్ ప్రాక్టీసు చేసుకుంటున్న ఫేక్ డాక్టర్స్ - దొంగవైద్యుల మోసాల్ని వెల్లడించింది. ''మంత్రం'', ''చీకటి పడుతుంది'' కథలు గ్రామ స్థాయిలో వైద్యవిధానపు స్వరూప స్వభావాల్ని తెలియ జేస్తాయి. అమాయక ప్రజలు మందుల ఖర్చులు భరించలేక మంత్రాలకు పోతే, మంత్రగాడు అంతకన్నా ఎక్కువ పైసలు అడుగుతాడు. వైద్యం చేసే బడి పంతులు ఫీజుగా డబ్బులు అడగడు, ఎప్పటి నుండో కన్నేసి వుంచిన సోములు భార్యను కోరుకుంటాడు. ఈ విధంగా సమాజ రుగ్మతల్ని సరైన పంథాలో డయగ్నోజ్ చేయగల కథకుడు డాక్టర్ దేవరాజు మహారాజు.

ఈయనకు ప్రజాజీవితం బాగా తెలుసు. కథలకు ఎన్నుకున్న అంశాలన్నీ పాటక జనానికి సంబంధించినవే. సమాజంలోని అట్టడుగు వర్గాలను గురించి తనకున్న సానుభూతిని, కళాత్మకంగా మలచి సజీవ చిత్రాలుగా పాఠకుల ముందుంచారు.

ప్రతి మండలానికి కొన్ని ఆచార వ్యవహారాలు ఉంటాయి. ప్రతి మండలపు పాత్రలలో ఒక ప్రత్యేకత కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. కాబట్టి ఆ మండలపు ప్రజా జీవితాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకుని అందులో అంతర్భాగం కాని రచయిత మాండలిక రచనకు పూనుకోవడం కష్టం. పూనుకున్నా అందులో భాష ఉంటుందే గాని, జీవం ఉండదు. మహారాజు గారికి ఆ సమస్య లేదు. ఆయన పుట్టి పెరిగింది తెలంగాణలోనే గనక, ఆ భాషలోని తెలుగు నుడికారాన్ని గుండెకు తాకేంత సూటిగా చెప్ప గలిగారు. ఆయనకు మాండలికం మీద ఆసక్తే కాదు, అధికారం కూడా ఉంది. ''పంతులు లేత శింతకాయ పులుసోలె నగిండు'' అని అంటారు. మంత్రం కథలో - సుక్కమ్మ అట్టడుగు వర్గానికి చెందిన ఒక మామూలు స్త్రీ. పంతులు వ్యంగ్యంగా నవ్విన నవ్వును ఆమె, ఆ విధంగా కాక మరో విధంగా ఊహించుకోలేదు.

''ఆపిల్ల కండ్ల ఊసులు... ముక్కు చీమిడి నోట్లో నుంచి సొల్లు - అంతా గలీజు. అల్ల బత్కోలె'' - అంటారు రచయిత. బాహ్యంగా కనిపించే ఆ అనారోగ్యంలోంచి అందుకు కారణమైన వారిని, వారి శ్రమ శక్తిని పీల్చి పిప్పి చేసిన దౌర్జన్య పరుల్ని చూడాలంటారు రచయిత. పైపై నినాదాలతో కాకుండా జీవితపు లోతుల్లోంచి సమాజ స్వభావాన్ని వెలికి తీసి చూపడం ఈ రచయిత ప్రత్యేకత. మధ్య తరగతి జీవితాన్ని, బడుగు వర్గపు బతుకుల్ని చిత్రించిన కథా సాహిత్యం ఉంది. కాని మహారాజు గారి

కథల్లో - అటు బడుగు వర్గానికి చెందక, ఇటు మధ్య తరగతికీ ఎదగక కొట్టు మిట్టాడుతున్న దీన జనుల ఆవేదనలు ఆక్రందనలు కనిపిస్తాయి. ''కండ్లు దెరిశినసెత్తురు'' కథను చాలా నిశితంగా పరిశీలిస్తే ఆ విషయం తెలుస్తుంది.

''పాతగోడ'' చాటున పెత్తనం చలాయించే దొరలు. కూలీల మధ్య తగాదాలు సృష్టించి వాళ్లు కొట్టుకుంటూ వుంటే చూసి ఆనందించే పెత్తందార్లు. ప్రాణం పోతుందన్నా వినిపించుకోక తమ కారు మురికి అవుతుందని వెళ్ళి పోయే రాజకీయ నాయకులు కూడా ఉన్నారు. ఈ కథల్లో.

'కోళ్లపందెం' కథలో దొరలు తమ రైతు కూలీలను 'కోళ్ళు'గా భావించి, వారి మధ్య పోటీ పెట్టి ఆనందించడం జరుగుతుంది. కోళ్ళతో ఆడుకునేది సంవత్సరానికి ఒకసారయితే, వీరితో సంవత్సరం పొడవునా ఆడుకోవచ్చని రచయిత సెటైర్. ఊరి సర్పంచ్-కరణం రాజకీయాల మధ్య గ్రామంలోని మామూలు పేద జనం ఎలా నశించి పోతున్నారనేది వర్ణించ బడింది.

నిజాం నీడలో, గ్రామాల్లో సాగిన భూస్వాముల ఆగడాలు మనకు చిల్లరదేవుళ్ళు వంటి నవలల్లో కనిపిస్తాయి. నిజాం పరిపాలన అంతమై పోయి, స్వాతంత్ర్యం లభించిన తర్వాత కూడా పల్లెలలో పెత్తం దారుల జులం పూర్తిగా నశించి పోలేదు. మెనకటిలా దొరలమని విర్రవీగలేరు. అట్లని మామూలు ప్రజలతో కలిసి పోనూ లేరు. అలాంటి క్లిష్ట పరిస్థితిని 'పాతగోడ' కథలో ఈ రచయిత వర్ణించారు.

దొర బంగళాకు, ఇతర గ్రామస్తుల ఇళ్ళకు మధ్య ఎత్తుగా నిలబడి వున్న గడిగోడ కూలి పోవడం ''పాతగోడ'' కథలోని ఇతివృత్తం. దొరతరం కూలి పోయిందన్న అర్థం స్ఫురించేలా రాయబడ్డ ఈ కథలో గ్రామస్థులు రాత్రికి రాత్రే వర్షానికి తడిసి వున్న గడిగోడను పడగొడతారు. అంటే దొరతనాన్ని పడగొట్టారని అర్థం!

జానపద వ్యక్తీకరణ గొప్పగా వున్న మరొక కథ ''యెలుగు మింగిన శీకటి'' ఇందులో ప్రమాద వశాత్తూ గుడిసెలు కాలిపోతే, గ్రామంలోని పటేలు ఇండ్లు కాలిన వారి దగ్గర చందాలు వసూలు చేసి ఫైరింజన్ వారికి మామూళ్ళు ఇవ్వదలుచుకుంటాడు.

సంపుటి మొత్తంలో ప్రత్యేకమైన కథ ''మూగమోసం'' కథంతా రైలు పెట్టెలో నడుస్తుంది. రైలు క్యారేజి సమాజానికి సంక్షిప్త స్వరూపం. సమాజంలో మోసం చేయనిది ఎవరూ! అందరూ ఎవరినో ఒకరిని ఏదో ఒక రకంగా మోసం చేస్తున్న వారు. జరుగుతున్న మోసాల్ని చూసి తమకు పట్టనట్టు వూరుకున్న వారుకూడా ఒక రకంగా మోసగాళ్లే. రచయితగా దేవరాజు మహారాజుగారు మాత్రం మోసం చెయ్యరు. కళ్ళెదుట వున్న సమాజంలోని అవకతవకల్ని ఆయన తనదైన పద్ధతిలో కళాత్మకంగా చెప్పారు. కవిత్వం రాయడం వల్ల కాబోలు - సంక్షిప్తం ఆయన కథల్లో ప్రధాన లక్షణం! పాఠకుల్ని ఆలోచింప జేసే ఈ కథలు సజీవ సమాజ చిత్రాలు.



డావెన్‌షైర్ జమీందారిణి పసిబిడ్డగా